ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల—౫.

శ్రీమద్ధన్వంతరయేనమః.

12/27

# అగస్త్యవైద్యము.

ఇది

చెన్నపురి ఆయుర్వేదకాలేజ్ ప్రిన్సిపాలును,
చెన్నపురి ధర్మ ఆయుర్వేద వైద్యశాలా ప్రధాన చికిత్సకులును,
శ్రీమత్పంచమజార్జి సార్వభౌమునిచే ప్రదత్తమగు
"వైద్యరత్న" బిరుదావళీ విరాజమానులు

నగు

ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి
పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. ఎస్.,

గారిచే విరచితము.

 ౧౯౧౮. [వెల అణాలు

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్యులు వారి స్వీయ

చెన్నపురి :

ఆయుర్వేద ముద్రాయంత్రమున ముద్రింపంబడి

౧౩, తంబుశెట్టివీధియందుఁగల

ఆయుర్వేదకలాశాలాభవనమున ప్రకటింపంబడియె.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

ఎ. వి. ఎస్. అండ్ ఎ. ఎమ్. బి.

# విజ్ఞాపనము.



దక్షిణాపథమందుగల అగస్త్యసంప్రదాయము ననుసరించు చికిత్సకులుచేయు చికిత్సావిధానములు ఔషధనిర్మాణములు మొదలగు వానిని నే బలుమారు చూచుచుండుటచే నవ్యాది నాగార్జునాది రసతంత్ర ప్రక్రియం కంటె భిన్నములగునట్లు దెలియవచ్చె. అయ్యవి రసతంత్ర ప్రక్రియావిభాగములకన్న నెట్లు భిన్నములో యాభాగమంతయు తత్సంప్రదాయజ్ఞులవలన దెలిసికొన చిరకాలమునకు పూర్వమే ప్రయత్నించితిని. ఆసంప్రదాయము ననుసరించియుండు గ్రంథముల విమర్శనమువలన అగస్త్యసంప్రదాయము నాగార్జునాది రససంప్రదాయముకంటె భిన్నమని నేజేసినకృషివలన దెలిసికొంటి. నే దెలిసికొనిన ఈ భాగములను అందరకు దెలిపిన బాగుండునని యోచించుతరి భగవత్ప్రేరణచే 1913 వ వత్సరము ఏప్రియల్ 18-19 తేదులయందు బొంబాయి మహాపత్తనమున జరిగిన అఖిల భారతవర్షీయ ఆయుర్వేద మహాసభా ద్వితీయవార్షికోత్సవమున నే నాసభ కగ్రాసనాధిపతిగ నుండుట సంభవించె. అట్టి మహాసమయమున నిట్టి నవీన విషయముల చర్చించుట ముఖ్యమని తలచి నాయుపన్యాసమున కొంతవరకు నీయగస్త్యవైద్య సంప్రదాయమునుగురించి ముచ్చటించితి. ఆసభ కేతెంచినవారలు ప్రాయికముగ నౌత్తరీయులగుటచే నిట్టి సంప్రదాయ మొకటి కలదాయని విస్మయమందిన వారలు కొందరును ఇది కేవలమాయుర్వేదమున జేరిన సంప్రదాయము కాదనువారు కొందరునై బయటువచ్చిరి. వారలకంతకును నా దెలిసిన కొలందిని అగస్త్యసంప్రదాయమందలి ముఖ్యభాగములు నాగార్జునాది రసతంత్రముకన్న ఉత్తమములని బోధపఱచితిని. నాటినుండియు అనేకులు

ప్రాంతములవారు ఉత్తర ప్రత్యుత్తరముల మూలమున ఈసంప్రదాయములను గురించి చర్చజరిపిరి. దానంజేసి యీయగస్త్య సంప్రదాయమును గురించి నేనును కొంత యధికపరిశ్రమ జేయవలసివచ్చినది. అందు నేజేసిన పరిశ్రమను మన యాంధ్రసోదరులకు దెలుప కుతూహలినై యుండ అస్మత్ప్రియమిత్రులును ఆంధ్రదైనిక పత్రికాస్థాపకులును దేశబాంధవులును అగు శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు తమ యాంధ్రపత్రికయొక్క యైదవ సంవత్సరాది సంచికకీ విషయమును వ్రాసి ఈయగోరిరి. వారి యపేక్షను బూర్తిజేయ నీవిషయము నొకవ్యాసముగ వ్రాసితిని. అద్దాని నాంధ్రపత్రిక అయిదవ సంవత్సరాది సంచికయందు **1914** ఏప్రిల్ మాసమున ముద్రింపబడె. నవీనమగు నీవిషయమును పలువురు మిత్రులు కోరియుండుటచే గ్రంథరూపమున నీగ్రంథమాలయం దైదవగుచ్ఛముగ ముద్రించితిని. ఈవిషయము ప్రాచీనకాలమున సర్వజనవిదితమై యుండినను ప్రకృతకాలమున గగన కుసుమముంబోలియున్నయది. గాన నవీనమగు నా విమర్శమునందు అనేకలోపములుండవచ్చును. పాఠకమహాశయులు వానిని విమర్శించి దెలిపినచో విధేయతతో గైకొనుచున్నాడను.

**25-5-14.**
ఆయుర్వేదాశ్రమం
మదరాస్.

డి. గోపాలాచార్యులు.

# అగస్త్యవైద్యము.

జగన్నిర్మాతయగు నా పరమాత్మ సర్వజనారోగ్యంబునకై యొసంగిన హేతు (రోగములు జనించుటకుఁ దగు కారణములు) లక్షణ (రోగములం జక్కఁగఁ దెలుపు చిహ్నములు) ఔషధ (రోగసామాన్యమును నివర్తిచేయు వివిధచికిత్సోపాయములు) స్కంధత్రయాత్మకమై విరాజిల్లుచు ననాది యని ఖ్యాతిఁజెందిన యాయుర్వేదము వివిధచికిత్సల సౌకర్యమునకై శల్యము శాలాక్యము మున్నగు నెనిమిది యంగములతో కూడియున్నను, "కాయచికిత్స" "శల్యచికిత్స" యను రెండు ప్రధానభాగములతో నిమిడియున్నది.

ఆయుర్వేదము దాని ప్రధానభాగములు.

అందు ఆత్రేయ అగ్నివేశ భేడాది మహర్షి ప్రణీతము లగు కాయచికిత్సా బోధక తంత్రమునకు నాత్రేయ సంప్రదాయమని పేరు.

ఆత్రేయ సంప్రదాయము.

ధన్వంతరి సుశ్రుత ఔపధేనవ ఔరభ్ర గోపురరక్షిత ప్రభృతి మహర్షులచే విరచిత మగు శల్యతంత్రము ధన్వంతరి సంప్రదాయమని తెలిసెడిని.

ధన్వంతరి సంప్రదాయము.

వైదికమహాయుగము మొదలు క్రమముగ నభివృద్ధిని బొందిన పై రెండు సంప్రదాయకములను నాయుర్వేదతత్త్వజ్ఞులు వైదిక వైద్యసంప్రదాయములని వాడెదరు.

రససంప్రదాయము.

తాన్త్రికయుగమున నాగార్జునాదులచే వృద్ధిని బొందింపంబడిన ఖనిజ వస్తు సమ్మేళనతోఁ గూడిన వైద్యకపద్ధతులకు తాన్త్రిక సంప్రదాయము లేక రససంప్రదాయమని వాడుకగలదు.

అగస్త్య సంప్రదాయము.

ఈ మూఁడు సంప్రదాయములకన్నను భిన్నముగ దక్షిణదేశమున విఖ్యాతమగు "నగస్త్యవైద్యము" అను వైద్యము గలదు. అయ్యది పైమూఁడు సంప్రదాయములలోఁ జేరినదియా లేక తద్భిన్నమా? ఇయ్యది యేకాలమునుండియారంభమైనది? దీనిమూలప్రవర్తకులు వారల పరంపర మొదలగువానిని సంక్షేపముగ వ్రాయుచున్నాఁడను.

చరిత్ర.

సకలజనవంద్యులగు శ్రీరామచంద్రులు జననీజనకుల యాజ్ఞంగైకొని పదునాల్గు వత్సరములకాలము విదేశములఁ గడపుచు క్రమముగ నగస్త్యాశ్రమమునకు విచ్చేసినటుల శ్రీరామాయణమునంగల వాల్మీకి వాక్యరత్నములు సర్వజనవిదితములు. ఈ వాక్యతతిచే శ్రీరామమూర్తికన్నను మున్ముందు అగస్త్యులు దక్షిణాపథయాత్ర సలిపిరని తెలియుచున్నది. అగస్త్యమహర్షి దక్షి

ణాపథగమనమును సలిపిన యెంతకాలమునకు రామభద్రుండు అగస్త్యాశ్రమమునకు విచ్చేసెనో యాకాలమును మాత్రము నిర్ణయించుట కష్టతరము.

శ్రీరామాయణరచనను గుఱించియు రామ రావణుల యుద్ధమును గుఱించియు కాలమును నిర్ణయించుటలో చరిత్రకారుల యాశయములు పలుతెఱంగులఁ గానంబడినను శ్రీ రాఘవుండును కుంభసంభవుండును సమకాలికులను విషయము పై కారణములచే సుస్పష్టము. జానకీజాని యగు నా శ్రీరాములు అయోధ్యను వదలి క్రమముగ లంకాపట్టణముఁ జేరువఱకును శోభించు మార్గముననుండు దండకారణ్యమం దక్కడక్కడను తక్కిన మార్గ మంతయును నగర రాజముల చేతను పురవరములచేతను మునిపల్లెలచేతను జనపదములచే తను శోభితమై మిక్కిలి యెక్కుడగు నాగరకతఁ జెందిన దని శ్రీ వాల్మీకి వాక్యములచే నూహింపఁదగును. మరియు రాక్షస రాజ మూర్ధన్యుం డగు దశాస్యుని రాజధానియందు పురవీథులను ప్రాకారములను ఉద్యానవనంబులను క్రీడాసరోవరంబులను అంతిపురంబులను అందలి స్త్రీసమాజంబులను వారి క్రీడలను కేవల స్వభావగుణములచే లోకోత్తరముగ శోభిల్లినట్టులు వాల్మీకిచే వర్ణింపంబడిన వాక్యజాలములు సర్వలోకవిదితములు

ఈరీతి నాగరకతఁ జెందిన కాలమునం గల మనుజులకు మిథ్యాహార విహారములచే జనించి పలుతెఱంగుల నపాయము

లను గలిగించు రోగములకుఁ దగు చికిత్సారూపము లగు శమ నోపాయంబు లుండుననుట స్పష్టము. ఆ శమనోపాయంబులు సుప్రసిద్ధాయుర్వేదీయ వైద్యకచికిత్స లనియె చెప్పకతప్పదు.

అనాదికాలమునుండియు ప్రజలయారోగ్యమును బాధించు వ్యాధి సామాన్యమును రూపుమాపుటకై యా పరాత్పరుని దయచే ననుగ్రహింపఁబడినది యాయుర్వేదము దక్క వేఱొండు లే దని ఋగ్వేదాదులయం దనేకచికిత్సా ప్రతిపాదక మంత్రరాజంబు లుద్ఘోషించుటచేతను ప్రపంచమునం గల వైద్యకపద్ధతులలో నాయుర్వేదీయ సంప్రదాయమే యనాది యని సకలదేశ చరిత్రకారులును వైద్యవిశారదులును తగు ప్రమాణముల నుదహరించుటంజేసియు నాయుర్వేదమే మొట్ట మొదటిది యని యొప్పుకొనకతప్పదు.

దక్షిణాపథమున వానరవర్గములోఁ జేరిన కాయచికిత్స శస్త్రచికిత్సలయం దసమానుఁడై సర్వ సైనిక ప్రధాన చికిత్స కత్వమును వహించిన సుషేణుఁడు దశాస్యునిచే ప్రయోగింపఁ డిన శక్త్యాద్యాయుధఘాతములచే మూర్ఛితుఁడైన లక్ష్మణుని మోహరహితునిఁగఁ జేయుటకై నస్యరూపముగ నుపయోగించిన "సంజీవకరణి" (మృతప్రాయు లగువారి నుజ్జీవింపం జేయు శక్తిగల యోషధుల) నుండియు, శస్త్రచికిత్సాప్రతిపాదక మగు "విశల్యకరణి" (శరీరమున గుచ్చుకొనిన బాణముల ములుకులను బైటికి వెడలించు శక్తిగల యోషధులు)

"సావర్ణ్యకరణి" (వ్రణప్రదేశములంగల చర్మమునకు యథాపూర్వమగు వర్ణము నిచ్చుశక్తిగల యోషధులు) "సంధానకరణి" (విఱిగిన యెముకలను జతపఱచు శక్తిగల యోషధులు) మొదలగువాని కృత్యములు స్వరూపములు మున్నగునవి స్పష్టముగ శ్రీరామాయణ యుద్ధకాండము 102 - వ సర్గయందు వర్ణింపంబడియుండుటచేత నాయుర్వేదీయ వైద్యకపద్ధతులు పై కాలమునకు ముందునుండియు ప్రచారములోఁ గలవని వ్రాయుట యనవసరము.

అగస్త్యాగమనమునకు ముందనార్యభూయిష్ఠ మని తలంచెడి కొందఱి మతముల ననుసరించి దక్షిణాపథమున ఆయుర్వేదీయ వైద్యకమార్గము లున్నవన్నఁబలుపురకు ఆశ్చర్యమును విస్మయమును గలుగకమానదు. ఇయ్యది కేవలభ్రమ యని తోఁచుచున్నది.

దశకంఠుండు పులస్త్యబ్రహ్మకు పౌత్రుఁడనియు నొకానొక సమయమున నీశ్వరునింగూర్చి సామవేదములచే స్తోత్రముఁజేసె ననియు వీరి మరణానంతరము విభీషణుఁడు ఉత్తరక్రియలం జేయుసమయమున ఆర్యులలో యాగాదిక్రతువులం జేసినవారికిఁ జేయురీతిని ఆహితాగ్ని సంస్కారములను జేసెననియు, మతంగ శరభంగాది మునిపల్లెలతోఁడను మార్గము గూడియున్న దనియు వర్ణితములగు వాల్మీకిపుంగవుని వాగ్గుంభనలు ప్రబలముగఁ గనంబడుటచేతను అగస్త్యుని యాగమన

మునకు చిరకాలమునకు పూర్వమే యల్ప సంఖ్యాకులగు నార్యులు వచ్చియుండినం గాని పై యార్యసంప్రదాయక చిహ్నలు గలిగియుండవని ఇక్కాలపు చరిత్రకారులు గొం దఱు నుడువుటచేతను, విమర్శితమగు అగస్త్య సంప్రదాయ మందును ఆర్షవైద్యమున ప్రధానప్రమేయములగు వాత పిత్త కఫములనెడి దోషత్రయమునె యాధారపఱుచుకొని ద్రవిడ వైద్యగ్రంథము లన్నియుఁ గానంబడుటచేతను, నింక ననేక కారణాంతరములచేతను నీ దక్షిణభూభాగము శ్రీ యగస్త్య చరణకమల సంస్పర్శము గలుగుటకు పూర్వమే యార్యభూ యిష్ఠమనుట విశదమగుచున్నది.

అల్పసంఖ్యాకులగు నార్యులచే నావృతమగుటచేత నెట్టి యభివృద్ధియు నార్యవిద్యలకుఁ గలిగియుండుట కవకాశము లేకుండెను. అగస్త్యమునివరుండు వచ్చినపిదప వారి నిజవిద్యా ప్రభావము లన్నిటిచేతను దక్షిణాపథమున భాష మొదలు సమస్తవిద్యలను సంస్కరించుట కారంభించెనని తోఁచుచున్నది.

అందు వైద్యకసంస్కారము సర్వజనుల కత్యంతావశ్య మైన దగుటచే క్రమముగ నార్యవైద్య సాహాయ్యంబున మూలికలయొక్కయు ఖనిజములయొక్కయు జ్ఞానము వినియో గములు ప్రక్రియలు మొదలగునవి సంస్కారపూర్వకమగు భివృద్ధిం గాంచె. పిదప నా ప్రవర్తకులయొక్క సంఘమును

పరంపరలను నేర్పఱచి కట్టుఁబాట్లను జేసెను. దానంజేసియె యీ ద్రవిడదేశమున నభివృద్ధిని బొందించిన పై వైద్యకపద్ధతు లన్నిటికిని "అగస్త్యవైద్యము" అను నామధేయముచే నిచ్చటి వైద్యలోకంబున వ్యవహారము గలిగె.

అగస్త్యసంప్రదాయ పరంపర.

ఈశ్వరుఁడు పార్వతికిని పార్వతి నందీశునకును నందీశుఁ డశ్వనీదేవతలకును వారలు ధన్వంతరికిని ధన్వంతరి యగస్త్యులకును అగస్త్యులు పులస్త్యులకును అతఁడు తేరయ్యార్ కును వీరు ఊహామునికిని క్రమముగ నీ వైద్యతంత్రము నుపదేశించినట్టు లిందలి గ్రంథముల కాననగును.

తన్త్రిప్రవర్తకులు.

ఈ సంప్రదాయ ప్రవర్తకులు నలువదియెనిమిది మంది యని కొందఱును మఱికొందఱు ఇరువది మంది యనియు ఇంకను కొందఱు పదునెనిమిదిమంది యనియు భిన్నమతములు సూచించిరి. ఈరీతి భిన్నమతములున్నను పదునెనిమిదిమంది యను పక్షమునే అందఱు నంగీకరించినట్టులును ఈతన్త్రిప్రవర్తకు లందఱకును సిద్ధులని పేరు గల్గినట్టులును దెలియుచున్నది.

పదునెనిమిదిమంది సిద్ధులు.

నందీశ్వరర్, అగస్త్యర్, మత్స్యముని, పిడినాః శర్, పులస్త్యర్, పుంశుండర్, కరువూరార్, తిరుమూలర్, చట్టముని, రోమరుషి,

భోగర్, బ్రహ్మముని, సుందరర్, వామదేవర్, తేరయ్యార్, కపిలర్, కమలముని, కొంగణర్ అను నీ పదునెనమండ్రును ఈ సంప్రదాయప్రవర్తకు లని యందఱు నంగీకరించినట్టులు ఊహాముని మొదలగువారి గ్రంథములచేఁ దెలియుచున్నది.

రెండువిధముల సిద్ధులు.

వీరిలో నగస్త్య పులస్త్య ధన్వంతరి నందీశ ప్రభృతి సంస్కృత భాషామయములగు వ్యావహారిక నామములు గలవారలు ఆయుర్వేద వైదికవైద్యమునను తాంత్రికవైద్యమునను సమర్థులనియు కరువూరార్ చట్టముని తేరయ్యార్ పిడినాక్కీశర్ పులిప్పాణి భోగర్ మొదలగు ద్రావిడనామధారులు ద్రవిడదేశజ మగు అగస్త్యసంప్రదాయ రసవైద్యక ప్రవర్తకులనియు వారివారి గ్రంథముల విమర్శనమునుండి తేటపడుచున్నది.

మఱియు సాంస్కృతిక తాంత్రిక వైద్య రచనా పద్ధతులు దెలిసినవారిని "వడ" (ఉత్తరము) సంప్రదాయజ్ఞులనియు కేవల ద్రవిడదేశ వైద్యకపద్ధతులఁ దెలిసినవారిని "తెన్" (దక్షిణము) సంప్రదాయజ్ఞులనియు వ్యవహరించెదరు. ఈ "తెన్" "వడ" సంప్రదాయములయందు సమర్థులగు సిద్ధులచే విరచితము లగు గ్రంథములఁ బరికించినచో నాత్రేయ ధన్వంతరి నాగార్జునాది సంప్రదాయ సమ్మేళన రూపముగ నుండు గ్రంథములం బోలెఁ గాన్పించుచున్నయవి.

అగస్త్య సంప్రదాయ ప్రవర్తకులచే విరచితములగు అగస్త్యవైద్య స్వరూ గ్రంథములయందలి జారణ మారణా ద్యుపాయము, దానిస్వతంత్రత. యములకును ప్రక్రియా పరిభాషలకును నాగార్జునుఁడు సోమనాథుఁడు మొదలగువారి పారిభాషిక పదములకును ప్రక్రియాభాగములకును జారణ మారణా ద్యుపాయములకును నెట్టిసంబంధము నున్నట్లు గానరాదు. మరియు నీప్రక్రియాది భాగములు నాగార్జునాది రస తంత్ర సంప్రదాయముకన్న సులభతరములుగను గుణాధికములుగను గన్పట్టు చున్నవి.

ఆర్ష సంప్రదాయమున రోగ నిదాన శారీర శల్య శాలాక్యాది భాగములు ప్రత్యేకముగ నున్న విధముగ స్వాతంత్రము వహించిన అగస్త్యసంప్రదాయమున ప్రకృతము బహిరంగముగ దొరకు గ్రంథములయందుఁ గానరావు ఈ గ్రంథములు ఆర్ష తాంత్రిక చికిత్సామిశ్రములగు గ్రంథములం బోలినవిగను వైదికవైద్య సంప్రదాయములతోడను ద్రవిడదేశజ రసతంత్ర సంప్రదాయములతోడను జేరియున్నట్లు విశేష గ్రంథముల విమర్శనలచేత తెలియుచున్నది.

ఈ యుభయ సంప్రదాయములయందలి గ్రంథములను నందలి ప్రక్రియాది భేదములను సూక్ష్మదృష్టిచేఁ జూచిన నగస్త్య సంప్రదాయమే యుత్తమమనియు నాగార్జునాది రస తంత్ర షంప్రదాయమునకన్న భిన్నమైనదనియు స్పష్టము.

చికిత్సా సామాన్యమునకు ప్రధానాంగమగు గుణపాఠ ములయందు వైదికవైద్యులకన్న నీదేశజులు కేవలము ద్రవిడదేశమందలి యనేక మూలి కలను భిన్నభిన్నరోగముల కుపయోగించుచు వాని మహిమ లను "గుణపాఠము" లను గ్రంథములుగ రచించిరి. ఈ గుణ పాఠములు ఆర్యసంప్రదాయమందలి గుణపాఠములయందు రస వీర్య విపాక ప్రభావగుణములను భేదోపాయములచే బోధింపఁబడు ప్రకారము లేక కేవలము ఆయావస్తువు లాయా రోగములం బోఁగొట్టునని మాత్రము గనఁబడుచున్నవి. వీనిని జూడ ద్రవిడదేశజులు వస్తుగుణములను నిరూపించునపుడు ఆర్య సంప్రదాయకమార్గములకన్న భిన్నమగు నేమార్గములచేతఁ గనిపెట్టిరో తగినన్ని గ్రంథములు ప్రకృతము దొరకకపోవుట చేత వస్తుగుణనిరూపణమును గుఱించి విశేషముగ వ్రాయఁ జాలకున్నాఁడను

గుణపాఠములు, ఓషధి జ్ఞానము.

కేవల చికిత్సా గ్రంథములు మాత్రము ఎక్కువగా నున్నట్టు పైనఁ దెలిపియుంటిని. వానిలో వైదికవైద్య ప్రక్రియాభాగములను వదలి కేవలము రసతంత్ర సంప్రదాయములను గుఱించి ఇంచుక పరి కించిన నయ్యవి నాగార్జునాది రసతంత్రములవలె మహారస ములు సాధారణరసములు ఉపరసములు లోహములు రత్న ములు అను భేదములచే వివరించినట్టు కనఁబడకున్నను ఖనిజ

రసశాస్త్రాభివృద్ధి.

వస్తు సామాన్యమును వదలక చెప్పినట్లు తోఁచుచున్నది. మరియు నాగార్జునాది రసతంత్రములకన్న క్షారములు, లవణములు, క్షారజద్రవములు (ద్రావకములు), విషసంయోగములు, పాషాణములు, రసకర్పూరములు, రసముల వికారమగు సౌవీరము వాని భేదములు, వాని విభాగములును, రసవాద ప్రక్రియాభాగములును విపులముగ వర్ణితములు. ఇట్టి విభాగములతోఁ గూడిన గ్రంథములు పెక్కులు గలవు.

పై బేర్కొనంబడిన యగస్త్యసంప్రదాయమందలి ప్రక్రియలలో గొన్నిటి నిచట వ్రాయుచున్నాడ.

జయనీరు.

యోగవిహితమగు భాగభేదముతో కూడిన క్షారలవణములు మొదలగువానిని సంయోగము చేసి యా సముదాయమును పాతాళయంత్రమున నునిచి అయ్యాది నియమితకాలమువఱకు భూమియందుంచి పిదప దానిని భూమినుండి పైకిఁదీసి యంత్రమును విప్పిన నందుండి పైనఁ జెప్పంబడిన క్షారలవణముల సముదాయము ద్రవరూపముగఁ బరిణమించును. ఈద్రవమునే “జయనీరు” అని యీ సంప్రదాయజ్ఞులు వాడెదరు. ఇట్టి జయనీరులచేత శంఖపాషాణము మొదలగు పాషాణవర్గములను రసవర్గములోఁ జేరిన రసము సౌవీరము ఇంగిలీకము మొదలగు వానిని “చుఱుకు” అను సంస్కారముచే నిష్పన్నందుంచిన ఘూమ

రూపమును బొందక స్థిరముగనుండునట్లు చేయుదురు. ఈరీతి ప్రక్రియలచేత సిద్ధమగు శంఖపాషాణాదులను రోగములయందు స్వల్పప్రమాణముచేత నుపయోగించెదరు. ఔషధయోగముల యందును జేర్చుచుందురు.

ముప్పు.

భాగభేదములతోడం గూడిన యుప్పులు మొదలగు వానిం జేర్చి యోగోక్తమగు నోషధిరసములతో భావనచేసి పిదప నగ్నిచే పచనము చేయుదురు. ఈరీతి సంస్కారముచేత సిద్ధమగు సముదాయమును "ముప్పు" అని యీ సంప్రదాయపరులు వాడుదురు. ప్రాయికముగ దీనిని రోగములయందును గంధకాది భస్మములను జేయుటయందును పరిమాణభేదములచే వినియోగించెదరు.

అభ్రకభస్మము.

ఆర్యాది సంప్రదాయమున ననేక పుటములచేగాని నిశ్చంద్రికమును (తళుకు లేకుండుటను) బొందని వజ్రాభ్రకమును నీసంప్రదాయము వారు "కుక్కపొగాకు" లేక "నాయి పొహిలై" అను మూలికారసముచేత నూటికి 10, 12 పుటములువేసి నిశ్చంద్రికమగు సింధూరమును జేసెదరు. ఇది నాగార్జునాది తంత్రములనుండలి ప్రక్రియలచేఁ జేయఁబడిన యభ్రకసింధూరమునకన్న పెక్కుమణుంగులు గుణాధిక్యమని నామతము.

మైలుతుత్తమునుగాని సౌవీరమునుగాని కొన్ని మూలి కల సాయంబున "డమరుక" యన్త్రింబున నునిచి యగ్నిచే పాకముచేయుదురు. నియమితకాలానంతరము యంత్రమునుండి భస్మమును గ్రహించెదరు. ఈ భస్మమును మిక్కిలి సూక్ష్మమగు మోతాదుచే పక్షవాతము సర్వాంగవాతము సర్వాంగశీతము మహోదరము మొదలగు వ్యాధులయం దుపయోగించెదరు. కొన్ని మోతాదుల యుపయోగపరచిన కొలంది కాలములోపలనే నిరుపమానమైన గుణముల నిచ్చును.

గురుభస్మము.

ఈ రీతి బంగారు వెండి తగరము సీసము ఇనుము కాంతము శంఖపాషాణము తాళకము ఉప్పులు క్షారములు మొదలగువానిని మూలికా సాహాయ్యమున భస్మము సింధూరము కట్లు (బద్ధములు) ద్రావకములు మొదలగునవి చేయు నుపాయములు నీ సంప్రదాయమున పెక్కులు గలవని వ్రాయుట యతిశయోక్తి కాదు.

పైనఁ బేర్కొనంబడిన భస్మసింధూర ద్రావకములు మొదలగునవి చేయు ప్రక్రియలు మొదలగునవి నాగార్జునాది రసతంత్రములయందున్న వానికన్న అధికములుగను సులభతరములుగను నున్నట్లు తెలియుచున్నది ప్రక్రియాభేదములతోపాటు

అగస్త్యసంప్రదాయ రసచికిత్సల స్వతంత్రము వానిగౌరవము.

యంత్ర సంయోజనాదులయందును చాల భేదమున్నట్లు కనc బడుచున్నది.

వ్యాపకము.

ఈ ద్రవిడసంప్రదాయక చికిత్సలు ప్రక్రియలు మొదలగునవి చెన్నపురికి దక్షిణదేశమునను సింహళము (యాళ్ప్పాణము) జాఫ్నా సింగపూరు బర్మా టిబెట్టు మొదలగు దేశములయందిప్పటికిని వ్యాపకములో నున్నట్లు దెలియుచున్నయది.

గ్రంథలుప్తత.

ఈ సంప్రదాయ ప్రవర్తకులగు పార్వతీ పరమేశ్వరులు నందీశులు విశ్వేదేవులు అశ్వనీ దేవులు ధన్వంతరి మొదలగువారు రచించిన గ్రంథములు సంపూర్ణముగc గానరాకున్నను నక్కడక్కడనైనను కొన్నిప్రతులు దొరకుట దుర్లభముగా నున్నది.

వడక్ తెన్ సంప్రదాయ గ్రంథపరంపర.

అగస్త్యులు తేరయ్యార్ చట్టముని భోగర్ కరువూరార్ పులిప్పాణి తిరుమూలరర్ మొదలగువారు సంస్కృతమునను ద్రవిడ భాషయందును రచించిన గ్రంథములు మాత్రము ప్రకృతము కొన్ని లభ్యములు.

అందు "అగస్త్యర్ ఆయుర్వేదం-ఆయరత్తైరనూఱు" మ గ్రంథమునందు వస్తుగుణములను, రస వీర్య విపాక ప్రభా

వములనెడు ఆర్షవైద్యకమార్గములవలెఁగాక కేవలము ప్రభావ రూపమగు గుణములనే పదార్థములకుఁ జెప్పియున్నది.

అగస్త్యర్ ఆఱునూఱు. అగస్త్యర్ పరిపూర్ణం నానూఱు. అగస్త్యర్ వైద్యకావ్యం. అగస్త్యర్ చెందూరం. పులిప్పాణి అయినూఱు. భోగర్ ఏడునూఱ్. ఊహాముని ఆయరం. ఉరోమఋషి అయినూఱ్. తిరుమూలర్ నాడిశాస్త్రం. ఈ మొదలగు ననేకగ్రంథములు కేవలము ద్రవిడసంప్రదాయములతోడను ఆర్షతాంత్రికమిశ్రమములుగను వ్రాయఁబడియున్నవి.

ఈ సంప్రదాయప్రవర్తకు లగు సిద్ధులు ఇరుతెఱంగుల భేదములు గలవార లని పైనఁ దెలిపియుంటిని. అందు అగస్త్యర్ ధన్వంతరి నిత్యానందసనాథులు మొదలగువారలు ఆర్షద్రవిడ సంప్రదాయములను దెలిసినవార లనియు సంస్కృత ద్రవిడభాషల గ్రంథముల రచించినట్లు అగస్త్యులు ఆయుర్వేద సూత్రములకు వ్రాసిన భాష్యమునుండియు నిత్యానందసనాథులు ఆయుర్వేదసూత్రమునకు వ్రాసిన వ్యాఖ్యానమునుండియుఁ దెలియుచున్నది.

వడసంప్రదాయ గ్రంథములు.

చట్టముని తేరయ్యర్ కరువూరార్ మొదలగువారలు ద్రవిడభాషా మయగ్రంథములు మాత్రము రచించినట్లు గ్రంథపరిశీలనము నుండి విశదమగుచున్నది.

తెన్ సంప్రదాయ గ్రంథరచన.

ఈ సిద్ధులలో కొందఱు సంస్కృతభాషయందలి యనేకార్ష వైద్యగ్రంథముల ననుసరించి ఆకాలముననె ద్రవిడభాషయందు కొంత గ్రంథ

గ్రంథపరివర్తనము.

పరివర్తనము కూడఁజేసినట్లు తేరయ్యర్ తిరుమూలర్ మొదలగువారి గ్రంథ సంచయమునుండి తెలియుచున్నది.

ఆర్షవైద్యక సంప్రదాయమందును ద్రవిడసంప్రదాయమందును సమానమగు ధన్వంతరి అగస్త్యులు మొదలగువారిచే విరచితములకు

పౌర్వాపర్యవిచారణ.

సంబంధించిన పౌర్వాపర్యములను గుఱించి విమర్శనలు విశేషముగఁ జేయఁ దగుట యావశ్యకము. దాని విషయమగు చరిత్రాంశములు మిక్కిలి నుర్ఘటములు. సంప్రదాయకగ్రంథములు విరళప్రచారములు. ప్రకృతము సిద్ధముగ దొరకు గ్రంథములు కేవలము సాంకేతికపదభూయిష్ఠములు. ఉపమాద్యలంకారసహిత మగు ప్రాచీనద్రవిడభాషా విరచితములు. సంప్రదాయకముగ లక్ష్యలక్షణముల నభ్యసించిన విద్వద్వైద్యు లల్పసంఖ్యాకులు. సంప్రదాయక మగు ప్రక్రియాభాగములును సందేహాస్పదములు. గ్రంథముల ననుసరించి యథామతిగఁ జేసిన పరిశీలననుండి నాగార్జునాది రసతంత్రములకన్న నగస్త్య సంప్రదాయక రసతంత్రములు మున్ముందని తోఁచినను సిద్ధాంతముగఁ జెప్పుటకు ప్రకృతము అశక్యము.

చిరకాలముగ ద్రవిడ సంప్రదాయముల నుండి గనుఁగొనిన విషయములకును నాగార్జునాది రస తంత్రములం గల పరిభాషాపదములు ప్రక్రియా విభాగములు విశ్వేదేవులతోఁ గూడిన యపూర్వ సంప్రదాయ క్రమములు మొదలగునవి వేర్వేఱుగ నుండుటచేత ఉత్తరపథమున నాగార్జునాదులచే నభివృద్ధికిఁ దేఁబడిన రసతంత్రములకన్న ద్రవిడదేశమున నగస్త్యాదులచే వృద్ధి పొందించఁబడిన రసతంత్ర సంప్రదాయములు ప్రాచీనములనియు భిన్న మనియు తలఁచుచున్నాఁడను.

రసతంత్ర స్వతంత్రత.

ద్రవిడభాష నభివృద్ధి నొందించుటకు చిరకాలమునకు పూర్వ మనేక సంఘము లేర్పఱుపఁబడిన వనియు వేదాంతశాస్త్రము సంస్కృతమందుకన్న విపులముగఁ గల దనియు ద్రవిడభాష లగు ఆంధ్ర కర్ణాట కేరళాది భాషలకు మాతృభాష యనియు ననేక చరిత్రకారులు వ్రాసియుండుటచేతను ఇఁక ననేక కారణముల చేతను స్వతంత్రమును వహించిన ద్రవిడభాషా మయమగు నగస్త్యసంప్రదాయము నాగార్జునాది రససంప్రదాయముల కన్న మున్నుం దని తోఁచినను అట్టి సంప్రదాయకగ్రంథముల కూలంకషముగ విమర్శింపక యెట్టి సిద్ధాంతమును జేయుట

స్వాభిమతము.

కళకర్తృడనై ప్రకృతము నాపరిశీలననుండి తెలిసికొనిన విషయములను సుజనులును విద్వత్పక్షపాతులును నగు మహాశయులకు విన్నవించినాఁడ.

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి
వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు ఎ. వి. ఎస్.
వారిచే విరచితమగు
అగస్త్యవైద్యము
సమాప్తము.

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల

# నియమములు.

---

ఆయుర్వేద వైద్యగ్రంథములను అందలి ప్రత్యేక ప్రత్యేక విషయములనబరగు శస్త్ర, గర్భిణి, రసాయన, ఓషధితత్వము, మొదలగు కొన్నిటిని తరవైద్యపద్ధతులతోఁ బక్కాగఁజర్చించి యాంధ్రభాషలో గ్రంథములుగ వ్రాసి ముద్రించెదను.

గ్రంథమాలయందలి గ్రంథములన్నియు జనోపయోగముకొఱకై ముద్రింపబడుచున్నందున సులభమైన వెలలకు నీయఁబడును.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలో బ్రచురింపఁబడు గ్రంథములన్నియు గైకొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు జందాదారులుగ నెంచఁబడుదురు.

శాశ్వతపుఁ జందాదారులకు మాగ్రంథమాలలోని మాధవనిదానమునకు దప్ప మిగిలిన గ్రంథములన్నిటికి నియమించిన ఖరీదులలో నొకరూపాయకు నాలుగు అణాలవంతునఁ దగ్గించి యిచ్చెదను.

శాశ్వతపుఁ జందాదారులుకానివారికి నిర్ణీతమగు వెలలకు నేమాత్రము దగ్గింపఁబడదు.

శాశ్వతపుఁ జందాదారులుగాని, శాశ్వతపుఁ జందాదారులు కానివారలుగాని యంచెకూలి (వి. పి. చార్జీ) వగైరాలు భరింపవలెను.

మా గ్రంథమాలకు శాశ్వతపుఁ జందాదారులుగ నుండువారు ముందుగాఁ జందాధనమును నియ్యనక్కఱలేదు.

పుస్తకములు ముద్రణమైనతోడనే ముందుగఁ దెలియఁజేసి యాయా గ్రంథములను వి. పి. గాఁ బంపెదను.

శాశ్వతపుఁ జందాదారులుగఁ గాఁదలచినవారు ప్రవేశము రుసుము క్రింద రు. 0-2-0 ల పోష్టుబిళ్లలను బంపుచు నిందుఁగనఁబఱచిన ప్రకారము గ్రంథమాలాధిపతులకు నుత్తరమును వ్రాసికొనవలయును.

అట్లు ప్రవేశము రుసుమును ముందుగాఁబంపక పుస్తకములను గోరు వారికి ముందుగాఁ బంపెడు పుస్తకముల వీఁపీలో 2 అణాలను జేర్చి వసూలు చేయఁబడును.

---

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోని ప్రథమగుచ్ఛముగు

# మాధవనిదానము.

---

"ప్రతిమనుజునివద్ద నుండదగిన వైద్యగ్రంథము."

ఈగ్రంథము మధుకోశ, పంజికా, ఆతంకదర్పణాద్యనేక వ్యాఖ్యాతల యభిప్రాయములతోడను. చరక సుశ్రుత వాగ్భటాదుల మతానుసారముగాను మాచేత భాషాంతరీకరింపబడినదై, నిదానదీపిక యను నాంధ్రవ్యాఖ్యతోఁగూడిన మాధవనిదానము సిద్ధముగానున్నది. వైద్యుల సహాయములేకనే సులభముగ వ్యాధులను గుర్తించునటుల జేయుటయందు దీనిని మించిన గ్రంథ మింకొకటిలేదు. జ్వరము, అతిసారము, పాండు, సంజు, మొదలగు 100 ప్రధాన వ్యాధులయొక్కయు, వాని అంతర్భూతములగు 1000 రోగములయొక్కయు పుట్టుటకుకారణములను, అవి రాఁబోవులక్షణములను, వాని నిజస్వరూపములను, ఇట్టి యనేక విషయములన్నింటిచే రోగముల నిశ్చయించుట ఈగ్రంథము విపులముగ సూచించుచున్నది. మరియు శాస్త్ర మర్యాదను దెలుపు మంచి పీఠికయు సంస్కృతభాషతోఁ కూడిన రోగముల పేరులకు తెనుగు ఇంగ్లీషు పేర్లును వివరముగ సర్వజనోపయోగముగ వ్రాయబడి మంచి గ్లేజుకాగితముల మీద ముద్రింపబడి సుమారు 600 - పేజీలుఁకలిగి క్యాలికో బైండు చేయబడియున్నది.

వెల పోష్టుఖర్చులుగాక రు. 3-0-0.

---

## ద్వితీయ గుచ్ఛము

# పథ్యాపథ్యము.

ఈ గ్రంథమునందు ప్రతిరోగియు నాచరింపఁదగిన పథ్యములగు నన్నము, కూరలు, పప్పులు, మాంసరసములు, శరీరవ్యాయామములు, వీనిలో నాచరింపఁగూడని యపథ్యములును మఱియు నాయా చికిత్సావసరముల పథ్యాఽపథ్యములగు వస్తి వమన విరేక స్వేద ప్రతిసారణాదిక్రియలయొక్క వివరణమును, రోగములురాకుండ ఆరోగ్యముగనుండుటకై వసంతాది ఋతువులయందు నాయా ఋతుధర్మములననుసరించి యాచరింపఁదగిన యాహార విహారాది హితాహితములను బోధించెడు "వివరణ" మను నాంధ్రటీకతోడ ముద్రించియున్నది.

చందాదారులకు పోష్టుఖర్చులుగాక రు. 0-12-0.

ఇతరులకు ,, ,, 1-0-0.

## మూడవగుచ్ఛము

# ఆయుర్వేదపరిభాష.

ఇయ్యది హిందూవైద్యులకు జ్ఞాననేత్రమువంటిది.

ఈపుస్తకము చేతనున్నయెడల వైద్యశాస్త్రమున ఏసందేహము గలుగదు.

కషాయ కల్క, తైల, ఘృత, ఆసవ, అరిష్ట, మోదక, రస, రసాయనాదులు జేయువిధములను వానియందు జేర్పదగు ఓషధులు మొదలగువాని పరిమితిని, (అనగా తూనికెను) తెలియజేయు మానపరిభాషలను, ఆహారము

నకు యోగ్యమగు ద్రవాద్రవాహారములను బోధించు పరిభాషలను ; ఓషధు లలో గ్రహించదగు నియమములను ; పంచపల్లవ, పంచభద్రము మొదలగు సాంకేతికములును ; వమనౌషధ, రేచనౌషధ, వ్యవాయౌషధ, వికాస్యౌ షధాది భేదములను ; స్వేదన, ఆశ్చ్యోతనము మొదలగు కర్మలయొక్క భేద ముల వివరమును అభావ ప్రతినిధివస్తువులను సూచించు పరిభాషలను వివర ముగ జెప్పంబడియున్నయవి. ఈగ్రంథమును జదివినమీద యిందలి వుపయో గము అందరికి జక్కగ గోచరమగును.

చందాదారులకు పోష్టేజిగాక రు. 1-2-0.
ఇతరులకు ,, ,, 1-8-0.

---

# ఆయుర్వేద (చరిత్ర)ము.

ఆయుర్వేదవైద్యము ఏకాలమునుండి ఆరంభమైనదియు, అందు ఏయే విషయములుగలదియు, వానివిభాగములును, అక్కాలమునగల శస్త్రవైద్యము యొక్క అభివృద్ధియు, ప్రకృతకాలమున భరతఖండమునందు ఆయుర్వేద మెట్లభివృద్ధికి దెచ్చుకొనవలసినదనియు ఇందు చక్కగ చర్చింపబడియున్నవి.

చందాదారులకు పోష్టుఖర్చులుగాక రు. 0-3-0.
ఇతరులకు ,, ,, 0-4-0.

---

# అగస్త్యవైద్యము.

ఇందు దక్షిణదేశమున నభివృద్ధిగాంచిన యగస్త్యవైద్య సంప్రదా యము దాని ప్రాచీనత మొదలగునవి వివరముగ దెలియగలవు.

చందాదారులకు వెల అణాలు 3.
ఇతరులకు ,, 4.

# శల్యతంత్రము.

(ఆయుర్వేదీయ శస్త్రచికిత్సాభ్యాసాదివిధి..)

దీనిని కనిపెట్టినరీతి ప్రాచీనత శస్త్రచికిత్సల స్వరూపము యంత్రములు శస్త్రములు వానిని బట్టుకొనురీతి వానిచే చేయదగిన శస్త్రకర్మభేదములు బంధనములు చరిత్రకారుల యభిప్రాయములు మొదలగునవి విపులముగ చర్చింపబడినవి.

చందాదారులకు వెల అణాలు 3.

ఇతరులకు ,, 4.

# వస్తికర్మ.

(ఇనిమా లేక పిచికారి.)

చరిత్ర వస్తిస్వరూపము అందు గొట్టముల భేదములు నిరూహ అనువాసన వస్తిభేదములు అందుజేరు వస్తుపరిమితి అర్హులు అనర్హులు వస్తివినియోగము ప్రచారము అభివృద్ధి మొదలగు విషయములను ఆంగ్లవైద్యమునందలి వస్తివిధమునకంటె నియ్యది అధికమని నిరూపించుట ఇత్యాది విషయములు గలవు ముఖ్యముగ దేశీయవైద్యులు చూడదగినది.

చందాదారులకు వెల అణాలు 3.

ఇతరులకు ,, ,, 4.

పై మూడుపుస్తకములు వకటేసారి చందాదారులకు ఈ ఏప్రియల్ మాసాంతమునకు బంపబడును.

# అర్క ప్రకాశిక.

ఇందు ద్రావకముల జేయు ప్రక్రియాలు మెండు అతిసులభముగ ప్రతి వస్తువునుండి ద్రావకముల దీసికొనవచ్చును. ఆంధ్రజనులు దీనినుండి ద్రావక సంబంధములగు ననేకవిషయముల దెలుసుకొనగలరు. రాగల మేమాసాంతమునకు సిద్ధమగును.

---

త్వరలో వెలువడును. త్వరలో వెలువడును.

# చరకసంహిత–సుశ్రుతసంహిత.

ఆయుర్వేదవైద్య సంప్రదాయములు యేమాత్రము దెలియక యిచ్చవచ్చినట్లు వ్రాయబడిన తెనుగు టీకలవలెగాక సంప్రదాయ సిద్ధముగ అనేకతడవలు పాఠములు జెప్పియు జదివియు అనేక వ్యాఖ్యాతల యభిప్రాయముల ననుసరించియు అనుభవజన్యమగు స్వాభిప్రాయములను జేర్చియు విపులముగ తేటదెనుగున వ్రాయబడిన ఆంధ్రవ్యాఖ్యతోగూడిన చరక - సుశ్రుతములు విస్తారమగు నుపోద్ఘాతములతోడను ముద్రణము త్వరలో పూర్తియై ఆంధ్రసోదరులకరంబు లలంకరించును.

అందు సుశ్రుతము యంత్రములు, శస్త్రములు, శారీరకసంబంధమును ప్రసవసంబంధమగు చక్కని ప్రతిమలను జేర్చిన షుమారు మున్నూరు పతిమలతోను కూడియుండును.

---

# శారీరము.

## Physiology. (ఫిజియాలజి)

ఇయ్యది చిరకాలముగ మా ఆయుర్వేదిక్ కాలేజియం దనాటమీ ఫిజియాలజీ బోధకులచే విరచితము. చర్మము, రక్తము, ఎముకలు, మాంస కోశము మొదలగువానిని బోధించు చిత్రప్రతిమలు షుమారు మున్నూరుగలవు.

ఆయా భాగములయందలి సాంకేతిక పదములకు ఆయుర్వేద వైద్యక సంస్కృతపదములును ఇంగ్లీషు పదములును వివరముగ సూచింపఁబడెను.

ఇంగ్లీషురాని ప్రతివారికిని మఱియు భాష తెలిసిన ప్రతిమనుజునికి మిక్కిలియుపయోగము. శైలిసులభము.

ఇట్టి గ్రంథమిదివరకు ఆంధ్రభాషయందు లేదు.

సంస్కృతాక్షరములతో ముద్రింపఁబోవు

# ఆయుర్వేద గ్రంథములు.

| | |
|---|---|
| ఆయుర్వేదసూత్రములు. | యోగానందనాథ విరచిత వ్యాఖ్యానసహితము. |
| భేడసంహిత. | మహర్షి భేడవిరచితము. |
| కల్యాణకారకము. | ఉగ్రాదిత్యాచార్య విరచితము. |
| యోగశతకము. | వరరుచివిరచితము (వ్యాఖ్యాసహితము) |
| ప్రశ్నోత్తరరత్నమాల. | అగ్నివేశ పునర్వసు సంవాదరూపము. |
| భేషజకల్పము. | చన్దనాచార్య వ్యాఖ్యాసహితము. |
| వాగ్భటమండనము. | పండితభట్ట నరహరివిరచితము. |

| | |
|---|---|
| చారుచర్య. | భోజమహారాజ విరచితము. |
| ఆయుర్వేదసారము. | రేవణసిద్ధవిరచితము. |
| ఆనందకందము. | మన్థానభైరవసిద్ధ విరచితము. |
| కాశ్యపసంహిత. | మహర్షి కశ్యపవిరచితము. (అతిప్రాచీనము) |
| శివతత్వరత్నాకరము. | కేరళిబసవరాజ విరచితము. |
| క్షేమజతర్క. | ప్రాచీనము. |
| రసప్రదీపము. | ప్రాచీనము. |
| నాడీతంత్రము. | ప్రాచీనము. |

మొదలగు గ్రంథములు అనేక గ్రంథముల సాహాయ్యమువలన నాయుర్వేదాశ్రమ పండితులచే జక్కగఁ బరిశోధింపంబడి ముద్రణమునకు సిద్ధముగ నున్నయవి.

మఱియుఁ బైగ్రంథములుగాని యింక నితరవైద్య గ్రంథములుగాని యెవరివద్దనైన నుండినయెడల మాకార్యాలయమునకు దయతోఁ బంపిన వందనములతోనందుకొని మాపుస్తకములతో సరిమాచుకొని పంపెదను.

మఱియు ముద్రణానంతరము ముద్రితమగు నొక గ్రంథమునుగూడ నుచితముగ బంపెదను.

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్లు,
ఎ.వి.ఎస్., ఎ.ఎమ్.బి.,
ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్పన్ వీధి,
జి. టి. మదరాస్.

టెలిగ్రాఫ్ అడ్రసు
"పండిట్" మదరాస్.

ఆయుర్వేద ముద్రాయంత్రమున ముద్రితము, మదరాస్.

శ్రీరస్తు.

భరతఖండమునందలి కలకత్తా, బొంబాయి, బనారస్,

మొదలగు పట్టనములయందు జరిగిన చిత్రవస్తు మహాప్రదర్శనములయందు

బంగారు పతకములను, మొదటితరగతి యోగ్యతాపత్రములను

శ్రీ శ్రీ శ్రీ గద్వాలమహారాణిగారినుండి మహామారినివారకౌషధములకై

బంగారు పతకమును బొందిన

శ్రీమత్పంచమజార్జిచక్రవర్తి సార్వభౌమునిచే "వైద్యరత్న" యను

బిరుదమునుబొందిన ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి

# పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. ఎస్.,

గారిచేత, శాస్త్రోక్తముగ తయారుచేయబడిన

# ఆయుర్వేదీయౌషధములు.

ప్రమేహభంజని:—మధుమేహము, బహుమూత్రము అను క్రూర వ్యాధులను బోగొట్టి, యెట్టియవస్థలోనయినను రోగికి శ్రమ నివారణమును కలుగజేయుటకు నిశ్చయమునయిన యౌషధము. ఈ యౌషధమువలన గుణమునుగాంచిన గొప్పవారనేకులు దీనివలన తమకు కలిగిన అధిక ప్రయోజనమును కృతజ్ఞతాపూర్వకముగ నొప్పుకొనుచున్నారు. వెల రు. 2—8—0.

వజ్రదంతచూర్ణము:—ప్రతిదినము దంతధావనము జేసినయెడల దంతములనుండి రక్తము కారకుండజేసి, దంత సంబంధమగు నితరవ్యాధులను నిర్మూలముచేసి దంతమూలములకు మిగుల దార్ఢ్యము గలుగజేయును.

డబ్బా 1-కి 4 అణాలు.

వృష్యయోగము:—వీర్యవృద్ధినిచ్చి బలమును కలుగచేయుటయందు ఉత్తమోత్తమమయినది. మెదడునకు మెదడునందుండు నరములకును ప్రధానావయవములకును పటుత్వమును, రక్తవృద్ధిని, దృఢబలమును కలుగజేయుటయందిది సంజీవివంటిది. వె. డబ్బా 1-కి రు. 1—0—0.

పూజ్యపాదవటి:—నరముల నొప్పులను నరముల ఈడ్పులను పక్షవాతములను, చచ్చువాతములను, నిర్మూలముచేయును. హృదయమునకు మిక్కుటమగు బలమును గలుగజేయును. వెల సీసా - 12 - అణాలు.

పంచానన లేపము:—ఈ యౌషధము తామరను శుభ్రముగపోగొట్టి విడవకుండ నుపయోగించినయెడల, తిరిగి యెప్పటికి పొడచూపకుండచేయును. వెల డబ్బా 1-కి 8-అణాలు.

సుఖవిరేచనవటి:—మాత్ర మినపగింజకంటె నధిక ప్రమాణముండదు అసహ్యములేకుండ సేవించదగినది. మలబద్ధకమును నివారించును. పశిబిడ్డలు కూడ నుపయోగింపనగును. వెల సీసా 1-కి 8-అణాలు.

అజీర్ణపంచాననము:—అజీర్ణమువల్ల కలిగెడు అనేక వ్యాధులలో జ్వరము, నిద్రలేకపోవుట, రొమ్ములో బరువు, నిస్త్రాణ, బలహీనము, కడుపునొప్పి యనునవి పోగొట్టుటకు రాజౌషధము. వెల డబ్బా 1-కి రు. 1.

తాంబూలవటి:—ప్రతిదినము తాంబూలముతో నుపయోగించుట కుద్దేశింపబడినది. మిక్కిలి బలమును కలుగజేయుటయేగాక, తాంబూలమునకు రుచిని పుట్టించి నోటిదుర్గంధమును పోగొట్టి, కంఠనాళములకును స్వరమునకును జీర్ణశక్తికిని సహాయముచేయును. 50 మాత్రలుగల సీసా 8-అణాలు.

కేశప్రసాదనతైలము:—శిరస్సు చల్లపడునట్లు చేసి వెంట్రుకలు ఊడిపోకుండ పెరుగుటను వృద్ధిచేసి, అకాలమున నెరవకుండునట్లుచేయును. మెరుగునూనెలకు బదులు దీని నుపయోగించుటచే కలిగెడు లాభము అసదృశము. వెల సీసా 1-కి రు. 1.

భృగువటి:—రెండురోజులలో శగరోగములను పోగొట్టి మర్మస్థానమునుండి విషజల స్రావమువాపును. దీర్ఘకాలమునుండి బాధింపుచున్న వ్యాధియందు వారముదినముల సేవవలన రోగిని మిక్కిలి మంచిస్థితికి తెచ్చుట నిస్సంశయము. వెల 24 మాత్రలుగల సీసా 1-కి రు. 1—8—0.

చంద్రకల:—ఒంటికణతనొప్పులు, అన్నివిధములగు తలనొప్పులు, పడిశము, రొమ్ముపడిశము, కల్లె, దగ్గు, సామాన్యవాపులు, కీళ్ళవాపులు మొదలగు వాటియందు దీనినిరుద్దినతోడనే, బాధ మాయమగును. ఇది ప్రతి యింటయుండదగిన కుటుంబౌషధము. వెల బుడ్డి రు. 0—8—0.

అశోకవటి:—స్త్రీల దురవస్థలను తొలగించుటకు అమూల్యమయిన యౌషధము. ఋతు సంబంధమగు నొప్పులను, ఇతరజబ్బులను, రజోగర్భాశయములు చెడుటవలన నేర్పడినవ్యాధులను మొదలంట రూపుమాపుటలో నిస్సందియము. వ్యాధినివారణమయినపిదప గర్భోత్పత్తియు సుఖప్రసవమును ఈ యౌషధ సేవవలన నేర్పడుచున్నవి. వెల సీసా 1-కి 12-అణాలు.

రక్తశోధక:—సవామేహములచేతను, రసదోషములచేతను, యింక ననేక కారణములచేతను, చెడిపోయిన రక్తమును శుభ్రపరచును. కురుపులు, చీడ, తామర, మేహపొడలు, మొదలగు చర్మదోషములను నిర్మూలము జేయును, నోటిపూతలను, అపుడపుడువచ్చు కండ్లకలకను బోగొట్టును.
వెల బుడ్డి రు. 2—8—0.

అబలాసంజీవిని:—(స్త్రీలకుగలుగు మదమూర్ఛలకు సిద్ధౌషధము) యువతులగు స్త్రీలకు ననేక కారణములచే గలుగు అపస్మారములను, మూర్ఛలను, గర్భాశయదోషములను, పలువిధ మనోవికారములను, బోనణచును. గర్భిణీ స్త్రీలు దీనిని సేవించిన గర్భాశయమునకు మిక్కిలి బలమును, సుఖప్రసవమును, గలుగంజేయును, మఱియు, ఇయ్యది స్త్రీలకేకాక మనుజ సామాన్యముగ సంభవించు మూర్ఛలను అపస్మారములనుకూడ నశింపజేయును.
వెల బుడ్డి రు. 1—8—0.

వృశ్చికదంశ నివారిణి:—తేలుకుట్టినచోట దీనిని రుద్దినయెడల, 5 నిమిషములలోనే కుట్టినచోటకూడ బాధలేకుండునట్లు జేయునని అనేక వేల మహనీయులు గొనియాడుచున్నారు. వెల బుడ్డి 0—8—0.

జంబీరరసాయనము:—(పైత్యములకు మంచిది.) నోట నీళ్లూరుట, తలతిరుగుట, రొమ్మునొప్పి, రొమ్ములోమంట, కడుపులో త్రిప్పుట, వాంతియగుట, పసరువెళ్లుట—ఈ మొదలగు పైత్యవికారములకు మిగులమంచిది. మఱియు, పైత్యాజీర్ణములకు, మిక్కిలి గుణకారి. వెలబుడ్డి రు. 0—8—0.

చ్యవనప్రాశన:—ఉబ్బసము దగ్గులను, క్షయదగ్గులను, సామాన్యపుపొడిదగ్గులను, రొమ్ముపడిశము వలన కఫము జాస్తిగానుండుటను, నివర్తి జేయును. రొమ్మునకు, ఊపిరితిత్తులకు బలమును కలిగించును. క్షయరోగులంతటివారి కసమానపుష్టిని శరీరమునకు శక్తినికలిగించును. బాలురను, వృద్ధుల

నకూడ సేవించదగును. బలమునకు దీసికొను చాపనూనెకంటె (Cod liver Oil) వేయిరెట్లు పనిజేయును. ఉబ్బసమువగయిరాలను రాకుండ కాపాడును.

వెల టిన్ను రు. 2—8—0.

అశ్వనివటి:—ప్రతిదినము వచ్చెడి జ్వరములను, దినమువిడిచి దినము వచ్చెడి జ్వరములను, వర్షాంతములవరకు విడువని జ్వరములను, బల్లలతోకూడిన జ్వరములనుకూడ నతిశీఘ్రములో మాయము జేయును. వెల బుడ్డి రు. 0-12-0.

మకరధ్వజ:— రోగసామాన్యములను రాకుండ జేయుటయందును, అనేక కారణములచేత బలహీనతనొందిన వారికి బలమును కలుగజేయుటయందును, హిందూవైద్యశాస్త్రమున నింతటి ఖ్యాతిగలమందు వేరొకటిలేదు. నియ్యది, బంగారు మొదలగు మిక్కిలి విలువగల పదార్థములచేత తయారు చేయబడినది. వెల తు 1-కి రు. 24—0—0.

7 డోసులమందు రు. 1—0—0.

సిద్ధ మకరధ్వజ:—పై మందువలనే, అత్యధికమగు బలమును, మెదడుకు నరములకు శక్తిని కలిగించును. మఱియు నపుంసక దోషములనుకూడ బోగొట్టును. నియ్యది, ముత్యములు, బంగారు, మఱియు యితర లోహములతో చేయబడిన యమూల్యౌషధము. వెల తు 1-కి రు. 80—0—0.

7 రోజులమందు రు. 5—0—0.

నారాయణతైలము:—పక్షవాతములు, చచ్చువాతములు, కీళ్ళనొప్పులు, వాపులు, శిరోవాతములు, దీనిని పైన రుద్దుటచేత నిర్మూలము చేయును. వెల బుడ్డి రు. 2—8—0.

నాడీవ్రణాంతక:— నారికురుపులకు వజ్రాయుధమువంటిది. గొప్ప వారనేకులు దీనిని యుపయోగించి దీనిపేరు సార్థకమనిరి.

వెల బుడ్డి రు. 0—12—0.

మాతులుంగరసాయనము:—(గర్భిణీ స్త్రీలకు సంజీవి) గర్భిణి స్త్రీలకు అనేక కారణములచే సంభవించు వాంతులు మొదలగు వ్యాధులను, బలహీనమును బోనణచును. మఱియు గర్భాశయమునకు బలమును కలుగజేయును. అధికప్రయాసచే ప్రసవించెడి స్త్రీలకు, బాధయనునది దెలియకనే సులభముగ ప్రసవముజేయుటలో, గర్భిణి స్త్రీలపాలిటికి సంజీవనియిదియే.

వెల బుడ్డి రు. 1—8—0.

వ్రణరోపణి:——గజ్జి, చీడ, పాసినపుండ్లు, కాలినపుండ్లు, వీనిని నిస్సంశయముగ నిర్మూలము జేయును. వెల డబ్బా రు 0—4—0.

వసంత కుసుమాకరం:——బహువిధ మూత్రవ్యాధులకును, మూత్ర మందలిగల తీపు దోషములకును, ఆర్యవైద్యశాస్త్రమున సుత్తమతమౌషధమని ఘంటాపథముగ జెప్పంబడుచున్నది. మఱియు, మధుమేహ బహుమూత్ర వ్యాధులచే గలుగు రోచ కురుపులను రాకుండ జేయును. గుండెకాయకును, నరములకును, బలమునిచ్చుటలో దీనికి సరిపోల్చుటకు వేరొకయవుషధము మాకు గోచరముగాకున్నది.

వెల తు 1-కి రు. 30—0—0; 7 రోజులమందు రు. 5—8—0.

ఆత్రేయవటి:——కీళ్ళనొప్పులు, సవామేహవాతనొప్పులు, కీళ్ళవాపులు మొదలగు వానిని, విడువకుండెడు దీర్ఘకాలపు నొప్పులనుకూడ రూపుమాపును. వెల బుడ్డి రు. 0—12—0.

బాలసంజీవనివటి:——ఈ మాత్రలను ప్రతి నిత్యము రేపుమాపువకటి చొప్పున యుపయోగించిన, అజీర్ణములు, దోమువిరేచనములు, జలుబు, దగ్గు, జ్వరము, మొదలగునవి రాకుండయుండును. వచ్చిన నిర్మూలము జేసి ఆరోగ్యమును గలిగించును. పసిబిడ్డల సంరక్షణకుగాను ప్రతికుటుంబమున నుండదగినది.

వెల 50 మాత్రలుగల సీసా 1-కి రు. 0—8—0.

విచిత్రరత్న లేపం:—— చాలాకాలమునుండి పీడించెడు సవాయి పుండ్లు, కొరుకుపుండ్లు, భగందర వ్రణములు, గండమాలా వ్రణములు, ప్రధానావయవమందలి వ్రణసామాన్యములు, స్త్రీల మర్మస్థలములయందలి వ్రణములు, మేహవ్రణములు, మొదలగువానిని శీఘ్రములో గుణము జేయును.

వెల డబ్బా 1-కి రు. 1—8—0.

కదళీకందపాకం:——రక్తవిరేచనములను, నోటివెంట, ముక్కువెంట పండ్లవెంట రక్తముపడుటను, రక్తవమనమును, రక్తకుసుమమును, శరీరతాపమును, ఎదురురొమ్ము అరకాళ్లు అరచేతుల మంటలను, మూత్రనాళమందలి పోట్లు మంటలను బోనణచును. సెగరోగులకుగల మూత్రపు చురుకునకును చాలామంచిది. పసిబిడ్డల కారకమునకు సంజీవనియె!

వెల టిన్ను 1-కి రు. 1—8—0.

మృగమదవటి:—కస్తూరి మాత్రలుగల ఒక ఈసీసా ప్రతికుటుంబములో నుండవలసియున్నది. సకాలములో నీ మాత్ర లుపయోగింపబడిన యెడల జ్వరమును రాకుండ జేసికొనవచ్చును, మఱియు జలుబు, రొమ్ము పడిశము, సన్నిపాతములను బోగొట్టును. వెలసీసా 1.కి రు 1.

సిద్ధగంధక రసాయనమ్:—రక్తశుద్ధిని చేయుటయందీ యౌషధము నంగల అత్యద్భుతమగు గుణమునుబట్టి చర్మవ్యాధులు కొద్దిరోజులీ యౌషధ సేవవలన నివారణమగుచున్నది. ఏడుదినముల యౌషధమునకు వెలరు. 2-8-0

వాశారిష్టం:—జలుబుతో కూడినట్టిగాని, జలుబులేనట్టిగాని ఉబ్బసములను నశింపజేయును. క్షయరోగులకు, రొమ్ముపడిశములకు, ఊపిరితిత్తులకు జేరిన ప్రతివ్యాధికిని, రక్తపిత్తమునకును, రత్నమువంటిది

వె. బుడ్డి రు. 1—0—0.

సౌరణపాకం:— రక్తముతోకూడిన మూలశంఖను అత్యద్భుతముగా కుదుర్చును. మఱియు మొలలతోకూడిన మూల జాడ్యమును కొంతకాలము సేవించిన నివర్తిజేయగలదు. వెల టిన్ను రు. 2—0—0.

స్వర్ణక్రవ్యాదరస:— చిరకాలమునుండియున్న అజీర్ణవాతములకు అమ్లపైత్యములకు అసమానమైనది. కడుపుబ్బరములను, పులితేపులను, బోనణచును. 7 రోజులమందు రు. 4—0—0.

స్వర్ణవంగం:—శుక్లనష్టములకు, స్వప్నస్ఖలనములకు, సంజీవివంటిది, మఱియు చిరకాలపు శగరోగములను ధ్వంసముచేయును.

7 రోజులమందు వెల రు. 4—0—0.

చందనబలాలాక్షాతైలము:—ఉబ్బసరోగము, క్షయరోగము, పురాణ జ్వరములు, పాండు, తలనొప్పులు, శిరోవాతములు, శరీర తాపము, ఉడుకు— ఇవియన్నియు, ఈతైలముచే నొకటిరెండుతడవలు అభ్యంజనము చేసుకొనిన గుణమగును. వెల బుడ్డి రు. 2—0—0.

ఖండకూశ్మాండలేహ్యము:—ఎండిపోవు శరీరస్వభావముగల బిడ్డలకు పెద్దలకును మాంసమునకు పుష్టిజేయును. క్షయము, ఉబ్బసము, పొడిదగ్గు, లవాశ్లకు మిగుల మేలుజేయును. ఊపిరితిత్తులకు మంచి బలమును గలుగజేయును. వెల టిన్ను 1-కి రు. 2—8—0.

'यस्मिन् देशे हि यो जातः तज्जं तस्यौषधं हितम्' वाग्भटः.

Ayurvedasrama Series—14.

# VISHUCHI OR CHOLERA

## (Etialogy, Treatment & Preventives.)

BY

**Vaidyaratna Pandit D. Gopalacharlu,**

Ayurvedamarthanda, Bhishagmani, A. V. S.,

*Principal, Madras Ayurvedic College and Senior Physician,*

*Madras Ayurvedic Free Dispensary, Madras,*

*President, All-India Board of*

*Ayurvedic Education, &c.*

AYURVEDASRAMA, MADRAS.

1917.



[Price As. 0-8-0.

"యస్మిన్ దేశే హి యో జాతః తజ్జం తస్యౌషధం హితమ్" వాగ్భటః.

ఆయుర్వేదాశ్రమగ్రంథమాల—౧౪.

# విషూచి - కలరా.

నిదానము, చికిత్స, వ్యాపకము దానినడ్డుచేయు నుపాయములు.

ఇది

చెన్నపురి ఆయుర్వేదకళాశాలా ప్రధానాధ్యక్షులును,

ఆయుర్వేద ధర్మవైద్యశాలా ప్రధానచికిత్సకులును,

అఖిలభారతాయుర్వేద విద్యాపీఠమునకు

అధ్యక్షులునునగు

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు,

ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి, ఏ. వి. యస్., వారిచే

రచియింపబడినది.

చెన్నపురి.

రిజిష్టర్డ్—కాపీరైట్.] ౧౯౧౪. [వెల ౦-౨-౦.

చెన్నపురి :
55, ఆచారప్పన్‌వీధియందుగల
వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి
స్వకీయాయుర్వేదముద్రాయంత్రమున ముద్రింపబడి
ఆయుర్వేదాశ్రమమున ప్రకటింపంబడియె.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,
ఎ. వి. ఎస్. అండ్ ఎ. ఎమ్. బి.

# పీఠిక.

అంటుజాడ్యములకుచేరిన కలరావ్యాధి ప్రకృతకాలమున పలుదేశముల యందు విజృంభించి యనేకులను దానికి నాహుతిగ జేసికొనుచుండుట యందరి కిని విదితము. నేను నావిద్యాభ్యాస కాలమునుండియు ప్రజల దీనిబారినుండి తొలగింపజేయు ప్రయత్నముల జేయుచుంటిని. నావంశపరంపరలనుండియు, పూజ్యులగు నాగురువర్యులనుండియు, గ్రహించిన విషూచి నివారణోపాయములను జేర్చి అందరకు నుపయోగించునటుల చిన్నిపొత్తముగ రచించి ప్రచురించిన నుపయోగమగునని తలచి కొన్నివత్సరములకు పూర్వము చిన్నపొత్తమును వ్రాసియుంటిని. దాని ప్రచురింప నుద్దేశించి యున్నతరుణమున నాంధ్రదేశమున భౌతికాదిశాస్త్రముల నాంధ్రసారస్వతమున నలంకరింపం జేసిన విజ్ఞానచంద్రికా గ్రంథమాలయందు శ్రీయుత డాక్టర్. ఆచంట. లక్ష్మీపతి, బి.ఏ. యమ్. బి. సి.యమ్. గారిచే 1910 సం॥ వ్రాసి ప్రచురింపంబడిన కలరా యను పుస్తకమున పైమండలివారి కోరికననుసరించి నాదెలిసిన కొన్ని యాయుర్వేదీయచికిత్సల ప్రచురించితిని. వాని యుపయోగమును నాయాంధ్రసోదరులు గ్రహించి నాటనుండియు ననేకులు మనయాంధ్రదేశమునకు హితమగు పథ్యాపథ్యములు మందులు వానివివరణములు మున్నగువానితోగూడిన ఆయుర్వేదీయ పద్ధతులతోజేరిన విషూచీ చికిత్సాబోధకమగు పుస్తక మవసరమని కోరియుండిరి. మరియు నిక్కాలమున సమరసంక్షోభాదులచే ననార్థౌషధములు దొరకమిచే గలిగిన కలవరమునుకూడ మనంబున నిడికొని భారతవస్తుసంచయముతోగూడిన మహర్షులయార్య చికిత్సలే భారతీయులకు సోదరన్యాయమున గాపాడగలవనియు ముచ్చటించిరి. ఇట్లు అనేకమిత్రుల కోరిక ననుసరించి యిరువదియైదువత్సరములుగ నాయనుభవముననున్న విషూచీ చికిత్సలను అది వ్యాపింపకుండుటకు తగు నుపాయములను జేర్చి యీ గ్రంథమాలయందు పదునాలవగుచ్ఛముగ నీపుస్తకము ప్రచురించితినాడను. ఇం దుదహరించిన చికిత్సలు సామాన్యముగ వైద్యుల చేతను ప్రామరులచేతను గూడ నప్పటికప్పుడు చేసికొన వీలుగలవిగను పల్లె

టూరులయందును సులభముగ దొరకు నౌషధులతో చేరినవిగను నున్నయవి. కొన్ని మాసములుగాని కొన్ని దినములుగాని గడపిజేయుమందులను, యంత్రములు మొదలగువాని సాహాయ్యమునుండి యతిశ్రమచే జేయదగుమందులను ఇందు జేర్పలేదు. ముఖ్యముగ నీపుస్తకమును సర్వజనసామాన్యముగ నుపయోగపరచు నుద్దేశమున వైద్యసాంకేతికముల నిందు వ్రాసియుండలేదు. మరియు వాతపిత్త కఫముల భేదములను పాటించి చికిత్సావిధానమును జూపక సామాన్యముగ త్రిదోషసామ్యమును గలిగించు చికిత్సలను వ్రాసినాడను. ఇందుకు శాస్త్రీయవైద్యసోదరుల మన్నింప వేడెదను.

ఈవ్యాధియొక్క నామము లోకమున విషూచి లేక కలరాయని ప్రసిద్ధముగాన నీగ్రంథమునకుగూడ "విషూచి-కలరా" యనియే పేరు పెట్టితిని.

ఈచిన్నపొత్తమును : షూచీచరిత్రము, నిదానము, చికిత్స, స్వాస్థ్య రక్షణోపాయములను నాలుగు ప్రకరణములుగ విభజించితిని.

## మొదటిప్రకరణము.

ఇందు విషూచీవ్యాప్తి దొరతనమువారి స్వాస్థ్యసంఘాధ్యక్షుని నివేదికలనుండి తెలుపబడినది. వేదముల కాలముననే విషూచి కలదనియు క్రమముగ దానిని ఆయుర్వేదవిదులు విశేషముగ చికిత్సాదివిధానములతో జెలిపి కొనిర్వహియు నిది వైదికకాలమందలి వ్యాధియనియు దెలుపబడినది. మరియొకటి దీనికింగల లోకవ్యవహారనామములును వ్యాపకతయుకూడ వివరింపబడినవి.

## రెండవప్రకరణము.

ఇందు పాశ్చాత్య ఆయుర్వేదమతముల నిదానసిద్ధాంతంబును విషూచీ సామాన్యలక్షణములును విషూచియొక్క ప్రథమ ద్వితీయ తృతీయావస్థలును సాధ్యాసాధ్యలక్షణములును సాంక్రామికలక్షణములును జూపబడినవి.

## మూడవప్రకరణము.

ఇందు విషూచీచికిత్సకు పూర్వము ఆచరింపదగిన నియమములును, తెన్ని వారకములగు మాత్రలును, కషాయములును, నస్యములును, అంజనంబును, భస్మంబును, వమనకర్మవిధానంబును నిరూపితములు. మరియు దప్పి, వెక్కిళ్లు, చలువలు, కాళ్లుకొంకర్లుబోవుట, నాడిక్షీణించుట, మూత్రము బంధించుట మొదలగు నుపద్రవములకు కషాయములు, మాత్రలు, లేపములు, తైలములు మొదలగు ప్రత్యేకచికిత్సలును గనుపరుపబడినవి.

## నాలవప్రకరణము.

ఇందు విషూచీరోగమున పథ్యాపథ్యములను విషూచి వ్యాపించియుండుకాలమున నర్వాది సోకకుండుటకై యాచరింపదగిన యుపాయములును; ఇండ్లు, దొడ్లు, ఇంటిచుట్టునుగల భాగములు మొదలగువానిని, వస్త్రములు, పాత్రలు, శయనోపకరణములు మొదలగువానిని పరిశుద్ధిము జేయవలసిన పద్ధతులును స్వాస్థ్యరక్షణోపాయములును నిరూపితములు.

"యస్మిన్ దేశే హియో జాతః తజ్జం తస్యౌషధం హితమ్" అనగా ఏదేశమందు జనించిన వానికి నాదేశమున జనించిన రోగౌషధులచేత జేయబడు చికిత్సయే యుచితమని పలికిన శ్రీవాగ్భటుని వాక్యంబుల ననంబున నేను కాని సాధ్యమగునంతవరకు దేశీయౌషధములను దేశీయుల యలవాటులోనుండు పథ్యాపథ్యములను జేర్చి యీ చిన్ని పుస్తకమును వ్రాసి ప్రచురించినాడను. భారతసోదరులు ఇందలి లోపములను మన్నించి గుణములను గ్రహింప ప్రార్థితులు.

| | |
|---|---|
| ౯-౮-౧౭<br>శ్రీకృష్ణజన్మాష్టమి,<br>ఆయుర్వేదాశ్రమము,<br>౨౫౫, ఆచారప్పన్ వీధి. | వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు. |



# విషయానుక్రమణిక.

చతుర్థప్రకరణము.

# సూచన.

ఇందు గనుపరుపబడిన మోతాదులను వానిసాంకేతికములను జక్కాగ నెరింగి యుపయోగించునది.

| | |
|---|---|
| గురిగింజ | పంకుడుగింజ |
| పెసలగింజ | ఒకగుక్కెడు (అ ౧ అవున్సు) |
| కందిగింజ | అరఅవునును |
| సెనగగింజ | ఐదుబొట్లు |
| యవపరిమితి | చిన్నియుండలు |
| నాల్గుయవలు | |

పైమోతాదులన్నియు ప్రాయికముగ పదివత్సరములకు పైబడినవార నుద్దేశించి చెప్పబడియున్నవి. వీనినే ఒకమాసమునుండి యారుమాసముల వయసు కల్గ శిశువులకు పైమోతాదులలో నెనిమిదవభాగము మోతాదుల నియ్యవలెను. ఆరుమాసములనుండి ఒకవత్సరమువరకును అరవభాగము మోతాదుల నియ్యవలెను. ఒకవత్సరమునుండి నాలుగువత్సరములవరకు నాలవవంతు మోతాదుల నియ్యవలెను. నాలుగువత్సరములనుండి పదివత్సరములవరకును అర్ధపరిమితిగల మోతాదునియ్యవలెను. పదివత్సరములనుండి మామూలు మోతాదుల వాడవచ్చును. దుర్బలులుగ నున్నవారికి పైమోతాదుల నుపయోగించునపుడును ఉచితానుసారముగ దెలిసి యుపయోగింపవలెను.

మాత్రరూపము౹గు మందులుగాక కషాయాదులనుకూడ పైవయోభేదముల పరికించి మోతాదులం గనిపెట్టి యుపయోగించునది. ఒకగుక్కెడు ఒక అవునుసునుగా భావించునది. ఇందు అచ్చటచ్చట "కొంచెముకొంచెము" అని కషాయాదుల యుపయోగమున దెలుపబడినది. దీనిని సమయమును రోగస్థితిని రోగిబలమును ఎరింగి పరిమితి నుపయోగించునది.

వస్త్రములు శుభ్రముపరచుట అను విషయమున గనబరచిన "వసపాకు కర్పూరము వేసికాచిన వేడినీళ్లు" అనుదానినే 'పైవేడినీటిని' ఆ ప్రాయస్థలములయందెల్ల గ్రహింపనగును.

౧౧ - పుటయందలి ఐదవ పఙ్క్తియందు
'గ్రీష్మవసంతముల' అనుచోట 'గ్రీష్మవర్ష ఋతువుల'
అని చదువుకొనవలెను.

# విషూచి - కలరా.

## ప్రథమ ప్రకరణము.

ఇయ్యది యాకస్మికముగను క్రూరముగను వ్యాపించు సాంక్రామికవ్యాధులలో నొకటియైయున్నది. ప్రపంచమున నుండు మానవసముదాయమున జరుగుచుండు లయమునకు కారణములగు వ్యాధులు పెక్కులుకలవు. అందు జ్వరము మొదటిదియనియు కలరా రెండవదియనియు దొరతనమువారి స్వాస్థ్యసంఘాధ్యక్షుని నివేదికయందు గనబరుపబడిన యీ క్రింది సంఖ్యలనుండి తెలియుచున్నది.

| సం॥ | కలరా. | జ్వరము. |
|---|---|---|
| ౧౯౧౦ | ౩౨౫౯౪ | ౩౨౧౩౮౧ |
| ౧౯౧౧ | ౫౮౧౭౪ | ౨౯౮౬౮౮ |
| ౧౯౧౩ | ౩౭౭౩౦ | ౨౬౮౦౨౪ |
| ౧౯౧౪ | ౬౮౪౪౯ | ౩౦౭౬౨౦ |
| ౧౯౧౫ | ౩౦౦౯౮ | ౨౯౦౨౮ |

పై సంఖ్యలనుండి యీ విషూచివ్యాధి క్రమముగ నానాట ద్విగుణాభివృద్ధిం గాంచియున్నది. విషూచివ్యాధివలెనే సాంక్రామికములలో జేరిన మసూరిక (మశూచికము) వ్యాధియు గూడ నానాట నభివృద్ధినందినట్టులు ఈ దిగువ కనుపరుపబడిన సంఖ్యలనుండి తెలియుచున్నది.

| సం॥ | మసూరిక. |
|---|---|
| ౧౯౧౦ | ౧౯౧౯౮ |
| ౧౯౧౧ | ౨౩౮౧౭ |
| ౧౯౧౩ | ౧౪౮౦౨ |
| ౧౯౧౪ | ౨౭౮౮౯ |
| ౧౯౧౫ | ౨౪౦౩౮ |

ఈ సంఖ్యలజూచిన నీవ్యాధియొక్క వ్యాప్తియు కొంతవరకు (అనగా ఒకటికి ఒకటిన్నర) అధికమైనట్టులు స్పష్టమగుచున్నది.

జ్వరము, కలరా, మసూరికము, ఈ మూడిటి సంఖ్యలలో జనసామాన్యముగను దేశసామాన్యముగను వ్యాపించు జ్వరముయొక్క వ్యాప్తి కొంచె మించుమించుగ నొకస్థితిలో నున్నది.

కలరా మసూరికముల వ్యాప్తిమాత్రము నానాట నభివృద్ధిలోనున్నట్టులు తేటబడుచున్నది. అందును కలరావ్యాధి ౧౯౧౦-వత్సరమునుండి చూపబడిన దొరతనము వారి నివేదనములయందలి సంఖ్యలం బట్టిచూడ విషూచి యను తనపేరును సార్థకముగ జేయుచున్నది.

ఈ సాంక్రామికవ్యాధుల వ్యాపనము క్రమముగ నభివృద్ధినొందుటంజూడ దొరతనమువారు లక్షలకొలది ద్రవ్యమును వెచ్చించి పారిశుద్ధ్యసంఘములనుండి చేయు ప్రయత్నములు నిష్ఫలములని తోచకమానదు. దొరతనమువారు ఆరోగ్యసంరక్షణమునకై యెట్టిప్రయత్నముల సలుపకున్నచో కలరా మసూరికము ప్లేగు మున్నగు సాంక్రామికవ్యాధులు వాని ప్రభావముల నింతకన్న నెన్నివేలభాగముల నధికముగ జూపియుండునో యూహింపజాలను.

లోకమున ప్రతిమనుజునకును విద్యయు నారోగ్యంబును ఆవశ్యకములు. ఈరెంటిలో నేది లేకున్నను వానిజన్మము నిరర్థకము. అందుకు మొదటిదియగు విద్య లేకున్న కేవలము నిష్ప్రయోజనము. ఏల? యన:—కొంతవరకైనను విద్య నభ్యసించిన వాడు వానియారోగ్యమునకై ప్రయత్నముల సలుపుకొనును. వానిని ప్రాయికముగ నేవ్యాధులు నాశ్రయింపజాలవు. విద్యాబుద్ధులు లేక సామాన్యముగ నారోగ్యమార్గముల నాశ్రయించనివారినే క్రూరములగు విషూచి, ప్లేగు, మసూచికము మున్నగు సాంక్రామిక వ్యాధులు విశేషముగ నాశ్రయించుచుండును. ప్రతిమానవుడును విద్యాబుద్ధులు గల్గియుండినగాని స్వయముగ నారోగ్యసంరక్షణము జేసికొనుటకు వీలుకల్గదు. ఈయర్థమునే పూజ్యులగు వాగ్భటాచార్యులు "శరీరచిన్తాం నిర్వర్త్య..." అను వాక్యముచే నుద్ఘోషించియున్నారు.

దొరతనమువారు తమశక్తికొలది ప్రజలయొక్కయు దేశముయొక్కయు స్వస్థతనుకాపాడుటకై తగుసదుపాయముల గలిగించెదరు. దానికిదగు ద్రవ్యమును వెచ్చించెదరు. హితముల బోధించు గ్రన్థముల బ్రచురించెదరు. సన్మార్గముల జూపెదరుకాని విద్యావంతులుకాని కొందరు మన్వాది స్మృతులయందు ఆరోగ్యవర్ధనమునకై బోధితములగు నాచారమార్గములను చరకాదులయందు బోధితములగు నారోగ్యమార్గములనుకూడ పాటింపక హితాహితముల దెలియక చేయు మూఢాచారముల మానుపజాలరు. పథ్యాపథ్యముల నెరుంగ: యిట్టివారికి సామాన్యముగనైనను విద్యాబుద్ధుల గరపుట ద్వా

తనమువారి మొదటిపనియైయున్నది. ఆయాప్రాంతములగల జ్ఞానవంతు లచ్చటచ్చటనుండు సామాన్యజనుల కందరకు విద్యాబుద్ధుల గరపవలెను. పలుమారు ఆరోగ్యమార్గముల నుపదేశింపవలెను. ఈ రెండువిధములగు నుపాయముల జేసినచో సామాన్యప్రజలందరును కొంతవరకు విద్యాబుద్ధుల గ్రహింపనోపుదురు. పిదప క్రమముగ నారోగ్యమార్గముల నాచరింపగడంగుదురు. అట్టి స్థితిసంభవించినగాని దుర్వృత్తములగు సాంక్రామికవ్యాధుల యాటోపముతగ్గదు. అటుకానిచో దొరతనమువా రారోగ్యసంరక్షణమునకై వత్సరమున కెన్నిలక్షలధనమును వెచ్చించినను ఫలముగన్పట్టదు. శాసనసభలయందు మన సభాసదులు ఆరోగ్యరక్షణమునకై దొరతనమువారు చేయుధనసహాయము చాలదని కంఠశోషగ వాదోపవాదముల జరిపియు ప్రయోజనము లేదు.

## — విషూచి - వేదములు. —

ఈక్రూరవ్యాధిని పరమప్రాచీనములని ప్రాచ్యపతీచ్య పండితవరులచే నిర్ణయింపబడిన ఋగ్వేదాదులయందు * "విషూచి"

* ఋగ్వేదము 5-వ అష్టకము, 1-వ యధ్యాయము, 1-వ వర్గము, "సోమారుద్రా వివృహతం విషూచీమమీవా యా నో గయమావివేశ । ఆరే బాధేథాం నిర్‌ఋతిం పరాచైరస్మే భద్రా సౌశ్రవసాని సన్తు" వి-భా "తాం విషూచీం - విష్వక్ - సర్వతః గచ్ఛన్తీం అమీవాం-రోగం వివృహతం - వియోజయతం."

అథర్వవేదము—7-వ కాండము, 4-వ అనువాకమ, 44 వ సూక్తము, "సోమారుద్రా ... ... వివేశ । బాధేథాం దూరం నిర్‌ఋతిం పరాచైః కృతం చిదేనః ప్రముముక్తమస్మత్" వి-భా, "విషూచీం-విష్వగ్గమనాం, అమీవాశబ్దవాచ్యం రోగం వివృహతం - వినాశయతం."

మైత్రాయణీసంహిత 3-2., కాఠకసంహిత 37-18., తైత్తిరీయబ్రాహ్మణం 2-8-1., శతపథబ్రాహ్మణం 12-7-3-2

యను నామముచే వాడుచుండుటం గనవచ్చును. ఇయ్యాది యనేకవిధంబులగు రూపములచే నలుదెసల వ్యాపించునది యనియు, ఏకకాలమున నతివేగమున ననేకులయందు వ్యాపించు పాపరోగమనియు దీనిస్వరూపమునునిశ్చయించి దానికను గుణముగునట్లు విషూచియను సంజ్ఞ నేర్పరచియున్నారు.

—॥ విషూచి - ఆయుర్వేదము. ॥—

పిమ్మట దానిననుసరించి యాయుర్వేదవిద్యను వ్యాపింపజేసిన * చరక సుశ్రుత వాగ్భటాదులు ఈవ్యాధికి ఊర్ధ్వాధోద్వారములయందు వమన విరేచన రూపముగ వ్యాపించుటంజేసి ‘ విషూచి ’ యనియు, వాతాదిప్రకోపవశంబున శరీరమునం దంతటను వ్యాపించి విశేషముగ సూదులచే బొడిచినట్లు బాధించుటంజేసియు విశేషముగ మరణమును సూచించుటంజేసియు “ విసూచి ” యనియు సార్థకనామముల నిడి తమతమ తన్త్రములయందు వ్యవహరించిరి. కావున వేదకాలమునుండి యాయుర్వేదకాలమువరకు నీవ్యాధియొక్క స్వరూప స్వభావములను వివరించునట్లు ఏర్పరుపబడిన పద్ధతులబట్టి యీ వ్యాధియొక్క సంజ్ఞావాచకములగు శబ్దముల రెంటికిని నాల్గువిధ

---

* చరకవిమానస్థానము, అ. 7.

“ తత్ర విషూచికా, మూర్ధ్వం చా ధశ్చ ప్రవృత్తామదోషాం యథోక్తరూపాం విద్యాత్.”

సుశ్రుత ఉత్తరతన్త్రము, అ-56, “ సూచీభిరివ గాత్రాణి తుదన్ సన్తిష్ఠతేనిలః । యస్యాజీర్ణేన సా వైద్యై రుచ్యతే తు విసూచికా. ”

వాగ్భటసూత్ర, అ-8, “ వివిధై ర్వ్యధనోద్భేదై ర్వాయ్వాదిభృశకోపతః । సూచీభిరివ గాత్రాణి విధ్యతీతి విషూచికా. ”

“ శబ్దకల్పద్రుమము, విశేషేణ మృత్యుం సూచయతీతి విసూచీ.”

ములగువ్యుత్పత్తుల నిర్ణయించుకొనదగియున్నది. అదియెట్లులన:
"విషు-నానా-అఞ్చతి-గచ్ఛతీతి-విషూచీ" "విష్వక్ (సర్వతః) అ
ఞ్చతీతి విషూచీ" "విశేషేణ సూచీభి రివతుద్యత ఇతి విసూచీ"
"విశేషేణ సూచయతి మృత్యుమితి విసూచీ" ఈనాల్గువిధము
లగు వ్యుత్పత్తుల యర్థము పైన వివరింపబడియున్నది.

—( విషూచి - లోకవ్యవహారనామములు. )—

ఇయ్యది క్రూరమగు నొకదేవతయొక్క వీక్షణమున
గల్గు వ్యాధియని పామరజనులు లోకమున సామాన్యము
వాడుకొనియెదరు. వారలు దీనిని మరిడిమహాలక్ష్మమ్మ, తుడ
లమ్మ, మారెమ్మ, గొట్టాలమ్మ, అను క్షుద్రదేవతల నామములతో
కూడ వాడెదరు. మరియువిషూచిజాడ్యము, వాంతిభేది, గత్తర,
దూము, విషభేది, భ్రాన్తి, చేదు, హైజా, అనునివి మొదల
నామభేదములచే నాయాదేశముల పలుదెరంగుల వాడుచుం
దురు. ప్రకృతకాలమున "కలరా" అని చెప్పినచో సకలదేశ
ములయందును సుబోధముగ నీవ్యాధియని గ్రహించెదరు.

—( విషూచీ - ప్రాచీనత. )—

ఇయ్యది కొన్నిశతాబ్దములకు లోపలికాలంబున బయలు
దలిన యొక నవీనవ్యాధియని యాధునికచరిత్రకారులు వ్రా
యుచున్నారు. పైజెప్పబడినట్లు మన గ్రంథములబట్టి పరికిం
చితిమేని ఈవ్యాధి నూతనముగాక అతిప్రాచీనమగు వేదకాల
మునకే వ్యాప్తినంది యప్పటి యార్య ఋషిపుంగవుల విమర్శన

ములకును పరీక్షకులకును లోనై వారికి స్వరూపస్వభావంబులు యథావస్థితరూపంబున దెలియునంతటి పరిచితికి పాత్రంబై వచ్చుచున్నదని తెలియగలదు.

—( విషూచి - వ్యాప్తి. )—

ఆధునిక చరిత్రకారులీవ్యాధియొక్క వ్యాప్తినిగురించి యిట్లు వర్ణించుచున్నారు. ఈవ్యాధికి జన్మస్థానము ఆసియాఖండము. అందును భారతభూభాగము. అందును వంగదేశము. ఇట్లాసియాఖండము జన్మదేశముగా నేర్పరచుకొనిన యీవ్యాధి ౧౮౧౭-వ క్రైస్తవ వత్సరమున విజృంభించి తూర్పున జపానువరకును దక్షిణమున మార్షల్ లంకలవరకును పశ్చిమమున కాస్పిక్ సముద్రమువరకును వ్యాపించెను. ఇట్లు తీవ్రముగ నీవ్యాధి వ్యాపించుచుండినను క్రైస్తవశకము ౧౮౩౦-వ వత్సరమువరకు నీవ్యాధి యైరోపాఖండమువైపునకు తనదృష్టిని ప్రసరింపచేయ లేదు. కాని ఆవత్సరముననే ఆఫ్ఘనిస్థానము, పరిషియాల మార్గమున ప్రయాణముసాగించి రషియాదేశంబున జేరి యచ్చట విచ్చలవిడిగ విహరించి యచ్చటనుండి యైరోపాయందలి దేశంబుల నన్నిటిని ప్రవేశించుచు నాశనముజేయుచు క్రమంబున ౧౮౩౨-వ వత్సరమున నింగ్లాండుకు చేరెను. పిదప నచ్చట తనకృత్యమును నిర్వర్తించుకొని మండుచుండు వేసవికాలపు టెండలకును భయమందక యట్లాంటిక్కు సముద్రము నవలీలగ దాటి కనడా యునైటెడ్డు స్టేట్సు మొదలగు ప్రదేశంబుల విస్రంభ

విహారము నవలంబించి గొప్పగొప్పపట్టణముల నన్నిటిని దిలకి
చెను. ఇట్లీసమరయాత్ర ౧౮౩౭-వ సంవత్సరమువర కీవ్యాధి
ఖండాంతరములయం దనర్గళముగ జరిగెను. పిమ్మట నిట్టియాత్ర
యీదేశంబుల నాలుగైదుసారులుమాత్రము జరిపినట్లు తెలి
యుచున్నది. ఇట్లు విచ్ఛిన్నమగు సంచారముగలిగి బహుకాలం
బుగ వ్యాప్తినందియుండు నీవ్యాధి జనించుటకు కారణమెద్ది?
యని విచారింతము.

---

## ద్వితీయప్రకరణము.

### —॥ విషూచి - పాశ్చాత్యవైద్యనిదానము. ॥—

ఈవిషయమై పాశ్చాత్యవైద్యవిశారదులు పరిశీలించి
౧౮౮౪-వ క్రీస్తవ వత్సరమునకు పూర్వమువరకు నితరవైద్య
పద్ధతులవారు వక్కాణించునట్లే యీవ్యాధికి అజీర్ణాద్యనేక
కారణముల చెప్పుచుండిరి. ఈవిషయము, వారు "కలరా"
శబ్దమునుగురించి చేయు * నవయవార్థములను పరిశీలించిన
తెలియగలదు.

పిమ్మట ప్రాయికముగ రోగసామాన్యమునకు సూక్ష్మ
క్రిములే ముఖ్యకారణములని స్థాపించిన "కాచి" యను జర్మను
దేశీయ వైద్యశిఖామణి కలరావ్యాధికిని కామావంటి సూక్ష్మ

---

* Vide Page 115. Encyclopedia & Dictionary of Medicine and Surgery Vol. II.

క్రిములే కారణములనియు నీసూక్ష్మక్రిములే జలము మొదలగు పానీయద్రవ్యములనుండి శరీరమున బ్రవేశించి విషూచి-కలరాను గలిగించుననియు తనయభిప్రాయమును ౧౮౮౪-వ వత్సరమున సిద్ధాన్తపరచెను. అదిమొదలుగ ప్రత్యక్షసిద్ధమగు నీకారణమే యుక్తమని దేశంబులయందంతటను ఏకగ్రీవముగ నంగీకరింపబడెను. అయినను విషూచీవ్యాధి కలిగినవారిలో కొందరి దేహములను పలుమారు పరిశీలించినను కామావంటి క్రిములగుపడకుండుటచే రోగసామాన్యమునకు చెప్పిన సూక్ష్మక్రిములే యీవ్యాధికి ముఖ్యకారణము లనిచెప్ప వీలులేదని నిర్ణయించువారును అందుకొంద రేర్పడిరి. అయినను వీరికంటె పైవారిసంఖ్యయే దేశమునందంతట నధికముగ నుండునట్లు తెలియుచున్నది. ఇట్టి వివరములందెలుపు గ్రంథములు ఆంగ్లభాషయందును తన్మతానుసారముగ వ్రాయబడు దేశభాషలయందును ప్రచురింపబడియుండుటచే గ్రంథభీతి నిట నీవిషయమును విడచుచున్నాము.

## విషూచి - ఆయుర్వేదసిద్ధాంతము.

ఋతుభేదముల ననుసరించి త్రిదోషములు చయప్రకోపప్రశమంబుల నందుటయు పదార్థములయందలి మధురాది రసంబులు న్యూనాధిక్యంబుల నందుటయు శీతోష్ణస్థితులు తారుమారగుచుండుటయు స్వభావసిద్ధము. ఇట్లు భగవదధీనంబులై స్వధర్మంబులతోగూడ ఋతువులుమారు నవసరంబున క్రమప్రాప్తిచే హేమంత శిశిరాది ఋతువులాపతింప త్రిదోషము

లలో నొక్కటియగు కఫంబు ఘనీభావంబునందును. ఇట్లు హేమంత శిశిరంబులయందు సౌమ్యాదిగుణంబులకును తజ్జన్యములగుధర్మంబులకును నలవాటుపడియుండు దోషాదిదేహభాగము లన్నియు శిశిరాంతంబునగలుగుమార్పువలన వసంతఋతుధర్మంబులగు నాగ్నేయాది గుణంబులును తదాధారభూతములగు ద్రవ్యంబులును సంబంధించుచుండుటచే తదనుగుణముగ సాత్మ్యము (అలవాటును) మార్చుకొనవలసియుండును. వెనుక ఘనీభావమునందియుండు కఫము కరగి ద్రవించుటచే ప్రకోపమునొందును. ఆసమయంబున జాఠరదీప్తి ఋతుస్వభావమున తగ్గును. ఇట్లు కలిగిన యగ్నిమాంద్యముచే నజీర్ణవ్యాధులు వసంతమున సహజముగ నుత్పన్నములగుట కవకాశము కలుగును. పిదప నాగ్నేయకాలముయొక్క యంతిమభాగమగు గ్రీష్మఋతువు తలచూపును. ఇందు కాలస్వభావముచే మనుజులబలము సహజముగ తగ్గును. వాతముచయావస్థనొందును. శ్లేష్మము క్షీణించును. వసంతఋతువునం దంకురించిన యగ్నిమాంద్యము అనుబంధముగనుండును. ఇట్లు గ్రైష్మికచర్య గడచుచుండ సౌమ్యకాలమున కారంభకమగు వర్షఋతువు ప్రారంభించును. ఇందు వెనుకనుండి యనుబంధమగు నాగ్నేయకాలముయొక్క గుణములన్నియు శీతవాతములచేతను వర్షముచేతను ఎల్లప్పుడును మేఘములు ఆకసమున కప్పియుండుటచేతను భూబాష్పముచేతను నొక్కపెట్టున తగ్గును. మలినముతో

గూడియున్న యుదకము ప్రవహింపనారంభమగును. ఉదకములు కలుషములగుటచే నమ్లవిపాకమును బొందును. వసంత గ్రీష్మ ఋతువులయందలి యగ్నిమాంద్యము అనుబంధమగును. ఆరు మాసములుగ ననుబంధమగు నాగ్నేయకాలమువిడిచి సౌమ్య కాల మారంభించును. దీనిచే గ్రీష్మవసంతముల ఋతుసంధితో బాటు దీర్ఘానుబంధమగు నాగ్నేయ (ఉత్తరాయణ) సౌమ్య (దక్షిణాయన) కాలములసంధియు నేర్పడును.

పై రెండువిధములగు ఋతుసంధి కాలసంధులయందు గలిగెడి నైజములగుమార్పులే ప్రాణికోటికిని గలుగును. ఈమార్పు ముఖ్యముగ నగ్నిమాంద్యముగను ఉదకదోషముగను ఎన్నదగియున్నది. వర్ష ఋతువున సహజమగు మలినోదకము చెరువులయందును బావులయందును జేరి వసంత గ్రీష్మఋతువులలో భూమియందు దాగియున్న యనేకవిధములగు రోగములకు కారణములగు బీజముల నంకురింపజేయును. అందువలన స్వాభావికముగ నగ్నిమాంద్యముచేత వాతప్రకోపమునకు నిలకడమైన వర్ష ఋతువునందు విఘూచి జనించును. పిదప తనమిత్రములగు గ్రహాణియు అగ్నిమాంద్యంబును బలహీనంబును గలవారి యెడలను తనపేరు వినినమాత్రముననే భీతినొందువారియెడలను ముందు ప్రకరణమున గనబరుపంబడు నపథ్యాహారముల సేవించువారియెడలను తననైజశక్తులను జూపుచు దండయాత్ర సలుపుచుండును.

సౌమ్యాగ్నేయ సంధికాలమునను హేమంతశిశిరఋతు వులకు జేరిన ఋతుసంధియందును పై యగ్నిమాంద్యాది దోషజ జన్యములగు విషూచిమొదలగు సాంక్రామికవ్యాధులు గలుగుటలేదు. ఏలయన— సౌమ్య ఆగ్నేయకాలసంధియందు శరీర హానికరములగువ్యాధులనన్నిటిని దూరము జేయదగినంతబలము శరీరమున నుండుటచేతను, సమస్తవ్యాధులకు మూలభూతము గు నగ్నిమాంద్య మాకాలసంధియందు లేకపోవుటచేతను, సమస్త జీవకోటికిని జీవనమునకును ప్రధానమగు పానీయము (నీళ్లు) మలినముగాక శుభ్రముగ నుండుటచేతను, ఆగ్నేయకాలమువలన తపింపంబడిన భూమి వెనువెంటనే చల్లబడుటగాని ఉదకాది పదార్థములు మలినములును అమ్లవిపాకములును నగుటగాని యీసౌమ్య ఆగ్నేయకాలసంధితో కూడిన హేమంత శిశిరఋతు వుల సంధియందు లేకుండుటంజేసియు నగ్నిమాంద్యవికారము లగువిషూచి మొదలగు సాంక్రామిక వ్యాధులు తలచూప నవకాశము లేకయున్నది.

—( విషూచీ సామాన్యలక్షణములు - ప్రథమావస్థ. )—

పై జెప్పంబడిన నిదానాదులనుండి గ్రీష్మవర్షఋతు సంధులజనించు క్రూరమగు నజీర్ణవ్యాధి విషూచియని తెలియు చున్నది. మరియు నీవ్యాధి యవస్థాభేదములచే నలసకమనియు దండాలసకమనియు వ్యవహరింపబడుచున్నది. దండాలసకమును కొన్ని గ్రన్థములయందు విలంబికయని వచించెదరు

ఈవ్యాధి గల్గునపుడు తొలుతొలుతదోముగ విస్తారముగ విరేచనములగును. కొన్నిసమయములలో పసరు నురుగు మొదలగు వానితోగూడి జీర్ణముకాని యాహారపదార్థములు వాంతులరూపమున వెలువడి పిదప గంజివంటి నీళ్లవిరేచనములగుటయుగలదు. వాంతులుకూడ వీనితో వెడలుచుండును. ఇత్తెరంగున వాంతులును విరేచనములును క్రమముగ నధికములై కొంతసేపటికి వాంతులైనను విరేచనములైనను నిలచును. లేక రెండు నొక్కసారిగ నిలచుటయుకలదు. పిమ్మట కడుపులోనొప్పి, ఆవలింతలు, కడుపుబ్బరము, మూత్రము వెడలక నిలచుట, భ్రమము, దప్పి, శరీరమున తాపము, శరీరమందలి రంగుమారుట, ఒడలువణకుట, రొమ్మునొప్పి, తలతిరుగుట, కాళ్లుచేతులు కొంకరలుబుట్టుట, ఈ లక్షణములు వరుసగ కలుగును. ఈవ్యాధియొక్క ప్రాథమికదశయందు పైజెప్పిన లక్షణము లన్నియైనను, లేక వానిలో కొన్నియైనను కలుగును. ఈవ్యాధి తరుచుగ తనసైజలక్షణములగు వాంతివిరేచనముల తోడనే యారంభమగును. లేక కొన్నిసమయములలో నీవ్యాధి వాంతులతోనైనను విరేచనములతోనైనను ప్రారంభమగుటయు కలదు.

## —( విషూచీ ద్వితీయావస్థ - అలసకము. )—

పై జెప్పబడిన లక్షణములలో ప్రధానములగు వాంతులు విరేచనములు నిలిచిపోవును. మూత్రము తగ్గును. కడు

పుబ్బర మధికమగును. అపానవాతము నిలచును. కడుపులో గుడగుడయనుశబ్దము కలుగును. దప్పి యధికమగును. చెమటలు క్రమముగ హెచ్చుచుండును. కంఠస్వరము హీనమగును. ఒడలు క్రమముగ చల్లనగుట కారంభించును. నాడి మందగించును. దోషములు ప్రకోపము నొందినకొలది వ్యాధి ముదిరి యధోద్వారమున వెడలువాతమును మలమును అడ్డుపరచును. ఊర్ధ్వద్వారమున వెడలు ఉద్గారము (త్రేపుల) ను వాంతిని నిలిపివేయును. ఆమాశయమునందలి పాచక పిత్తము వమనముతో బైలువెడలిపోవుటచేత లోపలికిదిగియున్న యన్నము మొదలగు పదార్థసామాన్యము పచనము నొందక మందీభూతమై యామాశయమున శల్యమువలెనుండి క్రూరములగు శూలమొదలగు నుపద్రవముల గలిగించును. దానంజేసియే దీనిని *యలసకమని శాస్త్రజ్ఞులు నుడివిరి.

## —దండకాలసకము.—

క్రమముగ దోషములు మిక్కిలి ప్రకోపమునొంది యామదోషముతో జేరి స్రోతస్సు లన్నిటియందును నిండియుండును. దానంజేసి వమనవిరేచనములు బొత్తుగనిలిచిపోవును. మూత్రనిరోధ మధికమగును. చెమటలు విస్తారములగును. కాళ్లుచేతులయందు కొంకరలధికములగును. నాడి

* "అలసం క్షోభితం దోషైః శల్యత్వే నైవ సంస్థితమ్ । శూలాదీన్ కురుతే తీవ్రాన్ ఛర్ద్యతీసారవర్జితాన్ । సోలసః" అష్టాంగహృదయ సూత్రస్థానము ఎనిమిదవయధ్యాయము.

నీరసమగును. శరీరము మంచువలెచల్లబడును. కండ్లు లోనికి లాగికొనిపోవును. దప్పి పలుమారు నీరుద్రాగుచున్నను అడంగక మిక్కుటమగును. నాలుక తెల్లబడి తాటిపట్టయంచులవలె గరకుగల్గియుండును. కడుపుబ్బర మధికమగును. ఎక్కిళ్లుమున్నగు నుపద్రవము లధికముగ నావరించును. ఈలక్షణములు విస్తరించుకొలది శరీరము ఇటునటుకదలక కొయ్యవలె నిలచిపోవును. దానంజేసియే యీ యవస్థకు * దండకాలసకమని శాస్త్రజ్ఞులు పేరిడిరి. పైజెప్పిన లక్షణములలో కొన్నికనిపించినను రోగి యమపురికేగ పైనముగట్టుచున్నాడని యెరుంగునది.

## —॥ అసాధ్యలక్షణములు. ॥—

§ దన్తములును గోళ్లును పెదవులును నల్లబడుట, మైమరచుట, వాంతియధికమగుట, కన్నులులోనికి లాగికొనిపోవుట, కంఠస్వరము మిక్కిలి హీనమగుట, కీళ్లు సడలుట, నాడులు మిక్కిలి సన్నగిలుట, అంగుష్ఠ వాతనాడి కనిపించకుండుట, ఈలక్షణము లన్నియునైనను కొన్నియైనను కనుపించిన రోగి బ్రతుకుట దుర్లభమని యెరుంగునది.

---

* "... ... అత్యర్థదుష్టాస్తు దోషాః దుష్టామలర్థథాః । యాంతిః స్థిరాం తనుం సర్వాం దండవత్ స్తమ్భయన్తి చేత్ । దండకాలసకంనామ తం త్యజేదాశుకారిణమ్ ॥" అష్టాంగహృదయము సూత్రస్థానము అష్టమాధ్యాయము.

§ "యశ్యావశ్యవదన్తోష్ఠనఖోల్పసంజ్ఞో వమ్యర్దితోభ్యస్తరయాతనేత్రః । క్షామస్వరః సర్వవినుక్తసన్ధిః యాయాన్నరస్సోపునరాగమాయ". అష్టాంగహృదయము ఎనిమిదవయధ్యాయము.

## —॥ విషూచి - సాంక్రామికము. ॥—

ప్రాచీనమహర్షులు ఈవ్యాధి విశేషముగ వ్యాపించు స్వభావముగలదియనియు విశేషముగ మృత్యువును సూచించునదియనియు నన్వర్థబోధకమగు "విషూచి" యను నామధేయము నిడుటచే నియ్యది సాంక్రామికవ్యాధులలో నొకటిగ పరిగణించినటుల దెలియుచున్నది. ఈసాంక్రామిక వ్యాధులను పాశ్చాత్యవైద్యులు 'పండమిక్' (ఒకగ్రామమున నచ్చటచ్చటవ్యాపించు స్వభావముగలవ్యాధి), 'ఎపిడమిక్' (ఆదేశమునందంతటను విరివిగ వ్యాపించు స్వభావముగలవ్యాధి), 'పాండమిక్' (ప్రాయికముగ ప్రపంచమంతయు నేకకాలమున వ్యాపించు స్వభావముగలవ్యాధి) అను మూడువిధములుగ విభజించియున్నారు. ఈ విషూచికూడ పై మూడువిధములగు స్వభావములు గలదియనునట్లు "విషూచి" యను నామధేయమే సాంక్రామికతను బోధించుచున్నది. దీనినుండివ్యాధులకుగల సాంక్రామికత్వజ్ఞానము పురాతనకాలమునుండియు నార్యులు దెలిసియున్నారనుట స్పష్టము. మరియు సాంక్రామికములను వాని వ్యాప్తినిగురించియు చరకమున విమానస్థానమందలి జనపదోధ్వంసనీయాధ్యాయమున గానవగును.

---

# తృతీయ ప్రకరణము.

## —౹ చికిత్సకు పూర్వము ఆచరింపదగిన నియమములు. ౹—

ఈ వ్యాధి గ్రామదేవతమున్నగు క్షుద్రదేవతలయొక్క క్రూరేక్షణమున జనించినదియని పిచ్చి నమ్మకములచేతను కొందరును, విరోధులగువారు జేయు క్షుద్రప్రయోగములు (శాతపతులు) మొదలగు నాభిచారికములవలన గలిగినదన్ని మరి కొందరును, దలంచి సకాలమున చికిత్సజేయకయుందురు. మరి కొందరు నిర్లక్ష్యముచేతను వెనువెంట దగుచికిత్స జేయకయున్నారు. ఇంకకొందరు సమయమునకు దగువైద్యుని సాహాయ్యము బొందలేని స్థితిలోనున్నారు. ఇట్టివారి ననేకుల నిప్పటికిని మనము చూచుచున్నారము.

అటుగాక కలరావ్యాధి సోకినదని తెలిసినతోడనే రోగికి ఏమాత్రమైనను భయమునుకల్గించక ధైర్యమును జెప్పవలెను. రోగిధరించు దుస్తులు పడక మొదలగువానిని ముందు చతుర్థప్రకరణమున జెప్పబోవుప్రకారము శుభ్రపరచియుంచవలెను. వెంటనే తగుచికిత్సకునకు దెలుపవలెను. ఒకవేళ చికిత్సకుడు అచ్చట లేకసమయమునకు తటస్థపడకున్నచో రోగియొక్క లక్షణముల బట్టి వ్యాధి యేస్థితియందున్నదియును పైగనబరచిన లక్షణముల నుండి తెలిసికొనవలెను. పిదప నీప్రకరణమున జెప్పినవిధముగ మందులను వానిమోతాదులను అనుపానక్రమములను గమనించి మిక్కిలి జాగ్రత్తతో నుపయోగించవలెను.

ఈవ్యాధికి సకాలమున దగుచికిత్స జేసినచో నూటికి నూర్గురును-ఆరోగ్యమును బొందుదురు. నేను గడచిన యిరువదియైదు వత్సరములనుండి విషూచీరోగుల కనేకులకు సకాలమునచికిత్స జేసి ఫలమునుజూచియున్నాడ. కొంతవరకు వ్యాధి ముదిరినపిదప జేయుచికిత్సలవలన ఫలమును విశేషముగ గాంచ నేరము. వైద్యునిబుద్ధి కౌశలమునుండియు, త్రికాలవేదులగు మహర్షులచే కనుగొనబడిన యౌషధముల ప్రభావవిశేషము నుండియు, అంతిమావస్థయందును జేయుచికిత్సగూడ ఫలమును జూపును. అట్టిచికిత్సలనే నేననేకసమయముల జేసియున్నాడను. కాని వ్యాధి యేయవస్థయందున్నను చేయుచికిత్సయు సఫలంబగు నని నమ్మదగదు. దీనిచే ప్రాథమికదశయందు చేయబడు చికిత్సలనుండి యెంతటిఫలమును గాంచగల్గుదుమో అంతటిఫలమును ఇతరావస్థల జేయుచికిత్సలచే గాంచనేరమనుట స్పష్టము. అనగా రోగారంభదశయందు చికిత్స జేసినచో నూటికి నూర్గురును స్వస్థతగాంచెద్దరు. ఇతరావస్థల జేయబడు చికిత్సల వలన నూటికి దాదాపు అరువదిమొదలు ఎనుబదివరకును ఆరోగ్యమును గాంచగల్లరని తలచెదను. గనుక "క్రియాకాలం న హాపయేత్" అను పూజ్యులగు వాగ్భటాచార్యులవాక్యమును స్మరింపుచు ప్రతిరోగమునందును తగినసమయమున చికిత్స చేయుట యావశ్యకము. విశేషముగ నిట్టిసాంక్రామిక వ్యాధులందును త్వరపడుట ప్రధానకృత్యము.

మఱియు—"విషరూపాశుకారిత్వాత్ విరుద్ధోపక్రమత్వతః" అని వాగ్భటమున జెప్పినప్రకారము ఈవ్యాధి విషమునుబోలె నతిశీఘ్రముగ ప్రాణహరమగు పనిని చేయునది కావున నొక నిమిషకాలమునైన నుపేక్షించక తోడనే చికిత్స జేయుట మంచి దనియు, నుసాధవ్యాధులయందును సకాలమున చికిత్స జేయ మరువకుండవలెననియు శాస్త్రకారుల సిద్ధాన్తము.

—॥ విషూచీశార్దూలము. ॥—

| | |
|---|---|
| శుద్ధిచేసిన యింగిలీకము | ఎండుమిరపకాయలచూర్ణము |
| తుంగముస్తలచూర్ణము | హారతికర్పూరము |
| కొడిసేపాలవిత్తులచూర్ణము | |

వీనిని సమభాగములుగగ్రైకొని యన్నిటి నొకటిగజేర్చి ఖల్వమున నునిచి యోమముకషాయమునుబోసి మెత్తగనూరి గురిగింజలవలె మాత్రలజేసి నీడనెండించి మంచి గాజుసీసాలో నుంచుకొనవలెను. దీనిని రోగియొక్క వయోభేదమును వ్యాధిబలాబలమును గుర్తెరింగి తదనుసారముగ రెండేసిగంటల కొకొక్కమాత్రవంతున ఉపయోగింపనగును. రెండు మూడు మోతాదులలో గుణము కల్గును.

—॥ కస్తూరీకల్పరసము. ॥—

| | |
|---|---|
| శుద్ధరసకర్పూరము | గోరోచనము |
| శుద్ధరససిందూరము | జున్ను (ఆదిపచ్చికాన) |
| శుద్ధయింగిలీకము | మిరియాలు |
| శుద్ధవసనాభి | కస్తూరి |
| పావుదారు | నల్లమందు |

వీనినన్నిటిని సమానభాగములుగ గ్రహించి యందు కస్తూరియు నల్లమందును దక్కతక్కిన వానినన్నింటిని ఖల్వమునను నిచి చనుబాలుబోయుచు కాటుకవలె మెత్తనగువరకు నూరి బిళ్లగాచేసి యాబిళ్లను వెంటనే లేతరావియాకులమూతలోనునిచి సంప్రదాయము నెరింగి పుటపాకము జేయవలెను. పుటపాకము జేసినపిదప నందుండి బిళ్లను వెలికిందీసి బిళ్లకంటియుండు ఆకులను విడదీసి మరల కల్వమునవేసి మునుపటివలె చనుబాలుబోయుచు రెండుజాములు నూరునది. బిళ్లచేసి దానిని లేతరావియాకుల సంపుటమునబెట్టి మునుపటివలె పుటపాక మొనరింపవలెను. ఈరీతి యేడుసార్లు పుటపాకము జేయవలెను. పిమ్మట ఈద్రవ్యసముదాయమున జెప్పిన కస్తూరిని నల్లమందును కూడచేర్చి మునుపటివలె చనుబాలుపోయుచు నాలుగుజాములకాలము కాటుకవలె మెత్తనగునట్లు నూరి పెసలగింజలంతేసియైనను లేక కందిగింజలంతేసియైనను మాత్రలుచేసి నీడనెండించి యుంచునది. ఈమాత్రలను రోగియొక్క వయోభేదమును రోగముయొక్క బలాబలమును అనుసరించి రెండేసిగంటల కొకమాత్రనైనను లేక రెండుమాత్రలనైనను మంచినీళ్ల యనుపానముతో నియ్యవలెను. కలరా వ్యాధియొక్క ప్రాథమికదశలో నీమందు నుపయోగించినచో నెవ్వరైన నపాయము జెందక సుఖమును గాంచుదురనుటకు సందియము లేదు. ఈయౌషధము కలరాను బోగొట్టునది యేగాక

చిరకాలమునుండి వేధించుచుండు గ్రహణిని అతిసారమును కూడ నివర్తింపజేయును. కలరావ్యాధిలో నొకప్పుడు మూత్రము వెడలక యడ్డుపడుటయు సహజముగ కల్గును. అట్టిసమయమున పైమాత్రలకుజెప్పిన ద్రవ్యములలో నల్లమందును మాత్రము వదలి తక్కినద్రవ్యముల జేర్చి పైజెప్పినప్రకారము పుటపాకముబెట్టి మాత్రలజేసి పైజెప్పినరీతి నుపయోగించినచో మూత్రము చక్కగ వెడలును. కలరావ్యాధిలో నేదశయందైనను ఈమాత్రల నుపయోగించినచో నమోఘమగు గుణమును కలుగజేయును.

## —॥ విషాదివటి. ॥—

| | |
|---|---|
| అతివస | జాజికాయలు |
| తుంగముస్తెలు | లవంగాలు |
| మారేడువరుగు | శుద్ధిచేసిన గంజాయి |
| మామిడిపప్పు | ఎండిన మిరపకాయలు |
| కొడిసెపాలవిత్తులు | హారతికర్పూరము |

పైజెప్పిన దినుసులలో కడపటిరెండు దక్కతక్కిన యెనిమిది ద్రవ్యములును ప్రత్యేకముగ నొక్కొకభాగముగను కడపటి రెంటిని రెండేసిభాగములుగనుజేర్చి వేర్వేరుగ చూర్ణముజేసి యన్నింటి నొకటిగ కల్వమునసునిచి గంజాయియాకు కషాయమునుబోయుచు లేక మంచినీళ్లనైనబోయుచు మెత్తనగునట్లు నూరి సెనగగింజలంతేసి మాత్రలజేసి నీడ నెండించవలెను.

ఈమాత్రలను వయోభేదమును వ్యాధిబలాబలమును అనుస రించి రెండుగంటల కొకతూరి యొకమాత్రవంతున నీళ్లతో నియ్యవలెను. ఈమాత్రలచే కలరా నివర్తించుటయేగాక చిర కాలమునుండి యనుబంధములుగనుండు వాతశ్లేష్మాతిసారంబు లును గ్రహణీరోగంబులును నివర్తించును. రక్తాతిసార పిత్తాతి సారములయందుమాత్రము మిరపకాయలను కర్పూరమును విడచి తక్కినపదార్థముల నన్నిటినిజేర్చి పైజెప్పినరీతి గంజా యాకు కషాయముననూరి మాత్రలజేసి యుపయోగించునది.

## విషూచీ నిషూదనరసము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మిరపకాయలపొడి | తులం | ౧ | నల్లమందు | తులం | ౧ |
| హారతికర్పూరము | ,, | ౨ | భాండవకర్పూరము | ,, | ౧ |

వీనిని పైజెప్పిన భాగముల ప్రకారము గ్రహించి ఖల్వమున నునిచి నిమ్మకాయలరసమును బోయుచు వారము దినముల వరకు చక్కగ నూరవలెను. పిదప రెండు లేక మూడు యవల పరిమితి గల్గునట్టులు మాత్రలుజేసి నీడనెండించి మంచి గాజు పాత్రలో భద్రముగనునిచి యుంచవలెను. ఈమాత్రలను వ్యాధి బలమున కనుగుణముగ గంట కొకమాత్రవంతున యుపయో గించవలెను.

## విషూచీ కాలానలము.

| | |
|---|---|
| ఇంగువ | మిరపకాయలపొడి |
| హారతికర్పూరము | నల్లమందు |

వీనిని సమానభాగములుగ గ్రహించి మంచి తేనె బోయుచు నైదారు దినములు చక్కగ మర్దనముజేసి నాల్గుయవల పరిమితిగల మాత్రలజేసి భద్రముగ నుంచునది. ఈ మాత్రలను రోగియొక్కయు రోగముయొక్కయు బలాబలముల ననుసరించి రెండేసిగంటల కొకమాత్రవంతున నీటితో నుపయోగించునది. మూడుమోతాదుల నుపయోగించునంతలో చక్కని గుణము కల్గును.

## —॥ అజమోదావటి. ॥—

మంచిక్రొత్తయోమమును పరిశుభ్రముగ రాళ్లు దుమ్ము మొదలగునవిలేకుండ చక్కజేసి పనిరెండురూపాయలయెత్తుకు తక్కువలేకుండ గ్రహించి దానిని యొకమట్టిమూకుటిలోనునిచి ప్రొయిమీదబెట్టి సన్నగ మంటబెట్టి దోరగవేయించి వేగినపిదప దానిని వేడిగనున్నపుడే ఖల్వమున నునిచి వేడితగ్గునంతలో మెత్తగా నూరవలెను. మెత్తగా నలిగినపిదప మరల మూకుటిలోవేసి మాడకుండునట్లు మునుపటివలె వేయించవలెను. దానిని వేడితోడనే ఖల్వముననునిచి మునుపటివలె నూరవలెను. ఇత్తెరంగున ఆరేడుతడవలు నూరినచో ఓమము నల్లగ నిగనిగలాడుచు చమురును కక్కుచు ముద్దయగును. అట్లు ముద్దయగుసమయమున పనిరెండురూపాయల యెత్తుగల ఓమమునకు నాల్గురూపాయల యెత్తుగల హారతికర్పూరమును పైముద్దతోజేర్చి మెలకువతో మెత్తగనూరి కుంకుడు

గింతలం తేసి మాత్రలజేసి భద్రముగ నుంచునది. ఈమాత్రలను వయోభేదమును వ్యాధిబలాబలములను గమనించి తదనుసారముగ నుపయోగింపనగును. దీనివలన కలరా నివర్తింపుటయేగాక చిరకాలమునుండి వ్యాపించియుండు అజీర్ణమునగల్గిన విరేచనములను గ్రహణులనుకూడ నియ్యది నివర్తింపజేయును.

—॥ మరిచాదివటి. ॥—

| | |
|---|---|
| మిరియాలు | హారతికర్పూరము |
| జిల్లేడువేరుల పైపొప్పర | ఓమము |

ఈనాల్గిటిని ప్రత్యేకము మూడేసి తులములవంతున గ్రహించి చూర్ణముచేసి యొకటిగ ఖల్వముననునిచి యల్లపురసమును బోయుచు రెండుమూడుదినములు మెత్తనగునట్లునూరి సెనగగింజలవలె మాత్రలజేసి నీడనేయెండించి సీసాలో నుంచుకొనవలెను. ఈమాత్రలను వ్యాధివయోబలాదులను పరిశీలించి తదనుసారముగ రెండుగంటల కొకతూరియైనను మూడుగంటల కొకసారియైనను నీటియనుపానముతో నియ్యవలెను. మూడు నాల్గు మోతాదుల నుపయోగించినచో విషూచి నివర్తించును.

—॥ విషూచీ గజకేసరి. ॥—

| | |
|---|---|
| నీడనెండించిన పుదీనాఆకుపొడి | నేతిలోవేగిన యింగువపొడి |
| హారతికర్పూరము | ఎండు మిరపకాయలపొడి |

వీనిని ప్రత్యేకము మూడేసి తులములవంతున జేర్చి అందు నల్లమందు నొకతులమును కలిపి యీనాల్గిటిని ఖల్వముననుం

పుదీనాఆకు రసమునుబోయుచు మాత్రల కనుకూలమగునట్లు నాలుగైదుదినములు మర్దనముజేసి కందులవలె మాత్రల జేయవలెను. వానిని నీడనెండించి మంచిగాజుకుప్పెలో నుంచునది. ఈమాత్రలను వ్యాధియొక్కయు రోగియొక్కయు బలాబలముల ననుసరించి మెలకువతో తడవకొకటి లేక రెండు మాత్రలవంతున నీళ్లయనుపానమున నుపయోగింపనగును. మూడునాళ్లు మోతాదుల నుపయోగించునంతలో విషూచి శమించును.

## —॥ కర్పూరాదివటి. ॥—

| | |
|---|---|
| హారతికర్పూరము తు. ౧ | దాచినిచెక్క తు. ౨ |
| నల్లమందు తు. ౧ | గవ్వపలుకుసాంబ్రాణి తు. ౨ |
| కుంకుమపువ్వు తు. ౧ | తుంగముస్తలు తు. ౩ |

ఈ వస్తువులను పైజెప్పిన భాగములప్రకారము గ్రహించి ఖల్వమునవునిచి నీళ్లనైనను పుదీనాఆకు కషాయమునైనను బోయుచు మెత్తగనూరి కందులవలె మాత్రలజేసి నీడనెండించి సీసాలో భద్రమగనునుచునది. ఈమాత్రలను వ్యాధిబలాబలములననుసరించి రెండుగంటల కొకమాత్రవంతున నీటియనుపానముతో సేవించినయెడ విషూచి యతిశీఘ్రముగ నివర్తించును.

## —॥ ఖదిరసారవటి. ॥—

| | |
|---|---|
| కాచు | ఓమము |
| మాచికాయ | కర్పూరము |
| చిన్నకరక్కాయలు | శుద్ధిజేసిన ఇంగిలీకము |

వీనిని ప్రత్యేకము ఒకతులమువంతున గ్రహించి చూర్ణముచేసి ఖల్వమునవైచి నిమ్మపండ్లరసమునుబోయుచు మెత్తనగువరకు నూరి రెండుగురిగింజలంత మాత్రలజేసి నీడనెండించి భద్రముగ నుంచునది. ఈ మాత్రలను ఘంటకొకసారి నీళ్లతో జేర్చి యిచ్చినచో వాంతిభేది నిలుచును.

## —॥ రసభస్మప్రయోగక్రమము. ॥—

ఇంగిలీకమునుండి తీయబడిన రసముచే వండబడిన రసభస్మమును భాండవకర్పూరమును సహజముగ నాంధ్రదేశమునగల వైద్యులు మిక్కిలి నేర్పుతో వాడుట సర్వజనవిదితము. ఈ రసభస్మమును కలరాయం దుపయోగించుట యుచితము. మనవారలు వ్యాధిబలాబలములను రోగిప్రకృతిని చక్కగగమనించి తగినప్రమాణమును గల్పించి యుపయోగింపక తమకు దోచినట్లెల్ల నుపయోగించుటచే నయ్యది విపరీతముగ పరిణమించును. దానంజేసి పండ్లూడుట నోరు పుండగుట మున్నగు బాధలుగల్గుచున్నవి. అటుగాక రోగియొక్కయు వ్యాధియొక్కయు బలాబలముల జక్కగగమనించి కలరావ్యాధియందు ఒక యవ (౧ గ్రైను) మొదలు పది యవ (౧౦ గ్రైను) ల పరిమితివరకు మోతాదుల గల్పించి మాత్రలుగాజేసి యామాత్రలను మంచిగోధుమపిండితోనైనను లేక శొంఠి మిరియములతోనైనను చక్కగ మాటుబెట్టి రెండు గంటల కొకతూరి యుపయోగింపవలెను.

లేక యొకేకతూరి పావుతులమెత్తును పదేనిమిదిమాత్రల జేసి మాటుబెట్టి యొక్కొకమాత్రను క్రమముగ మ్రింగించవలెను. ఇయ్యది విశేషముగ కలరాయందు గుణకారియగు నౌషధరాజము. సుకుమారులకును గర్భిణీస్త్రీలకును భయపడు స్వభావముకలవారికిని దీని నుపయోగింపజనదు. మరియు దీనిని వైద్యవిశారదులు సమయభేదముల కనిపెట్టి యుపయోగింపవలెను. గాని అందరును వారివారి యిచ్ఛవచ్చినట్టులు ప్రవర్తించుట మిక్కిలి యనర్థకరమగునని యెరుంగునది.

—॥ జీరకాదికషాయము. ॥—

| | |
|---|---|
| జీలకఱ | ఆవాలు |
| ఓమము | మిరియాలు |

వీనిని ప్రత్యేకము ఒకతులమువంతున గ్రహించి యన్నిటిని మూకుటిలోనునిచి ప్రోయిమీద బెట్టి సన్నపుసెగను మూడుభాగములు వేగునట్లు వేయించి యందు ఒకసోలెడు నీళ్లు పోసి మూతమూసి యొకపొంగువచ్చునందాక కాచి మంచి పాత్రలోకి వడగట్టియుంచునది. దీనిని విషూచీవ్యాధి ప్రారంభదశయందు రోగికి రెండుగంటల కొకతూరి యొకగుక్కెడు (ఒక అవున్సు) వంతున మూడునాల్గు మోతాదుల నియ్యవలెను. కలరావ్యాధి నిశ్శేషముగ నివర్తించును.

—॥ వచాదికషాయము. ॥—

| | |
|---|---|
| దోరగమాడ్చిన వస పలం. ౧ | దోరగమాడ్చిన పచ్చిబియ్యపు పిండి పలం. ౧ |
| దోరగమాడ్చిన యెండుమిరపకాయలపొడి పలం. ౧ | ముదురు మారేడాకు పలం. ౧ |

వీనినన్నింటిని పైజెప్పిన భాగభేదములచే గ్రహించి యందు నాల్గు శేర్ల తరవాణినీళ్లు (కలినీరు) పోసి నాల్గవపాలుమిగులు నట్టులు కాచి వడియగట్టి యీకషాయమును రెండుగంటల కొకతూరి తడవకు అరఔన్సువంతున ఇయ్యవలెను. రెండు మూడుమోతాదులలో విషూచి నిర్మూలించును.

—॥ భృంగరాజనస్యము. ॥—

విషూచియందు స్మారకములేక యుండునపుడు గుంట కలగరాకు పసరును రెండుముక్కులలో నైదేసిబొట్లు విడువ వలెను. ఇట్లు రెండుమూడుతడవలు అవసరమునుబట్టి నస్యము జేసిన మైకము తగ్గును. విషూచి గుణమగును.

—॥ చించాదినస్యము. ॥—

త్రికటుకము (శొంఠిపిప్పలిమిరియము)ల చూర్ణమును సైంధలవణమును చింతాకురసములో కలిపి రెండుముక్కులలోను ఐదేసిబొట్లు విడువవలెను. దీనినుండి మూర్ఛయు విషూచియు నిలిచిపోవును. ఇయ్యది సుకుమారులకును బాలులకును వృద్ధు లకును గర్భిణీస్త్రీలకును నుపయోగింపంజనదు.

—॥ కరంజాద్యంజనము. ॥—

కానుగవిత్తులపప్పు, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, పసుపు, వీనిని సమభాగములుగ గ్రహించి మాదీఫలరసముచే చక్కగా నాలుగైదుదినములును మెత్తగనూరి కణికలుగజేసి నీడ నెండించి యుంచవలెను. విషూచియందుకలుగు మత్తునందు ఈకణి

కలను మాదీఫలరసముతో నైనను నిమ్మకాయరసముతో నైనను సానమీాద నరగదీసి కండ్లలో కందిగింజంత వేయవలెను. దీని నుండి మూర్ఛయు విషూచియందు కల్గు నుపద్రవంబులును తగ్గును. దీనిని సుకుమారులకును గర్భిణీస్త్రీలకును ఉపయో గింపకూడదు.

—( వమనకర్మ. )—

విషూచియందు కడుపుబ్బరంబును వాంతులును అధిక ముగనున్నపుడు గోరువెచ్చని వేడినీటిలో కొంచ ముప్పుకలిపి యిచ్చిన వాంతియగును. దీనిచే కడుపునందలి దోషమంతయు బైటికి వెడలును. వాంతులు తగ్గును. ఇయ్యబడుమందులు శీఘ్ర ముగ గుణకరములగును. ఈప్రక్రియనుమాత్రము మిక్కిలి జాగ రూకతతో సమయము నెరింగి వైద్యవరు లుపయోగింపవలెను.

—( వాంతులు నిలుపుటకు చికిత్సలు. )—

—( సర్షపలేపము. )—

కలరావ్యాధియందు వాంతులు విశేషముగ నగు న్న చో ఆవాలను పిండిజేసి నీళ్లుబోసి మెత్తగనూరి రెండుగ్ర వెడలుపును ఆరంగుళములు నిడివియుకల యొక తెల్లని గుడ్డకుష సి బొడ్డుదగ్గిరనుండి యెదురురొమ్ముకు పైవరకు పట్టివేయవలెను ఆపట్టీవలన విశేషముగ మంటబుట్టినచో తీసివేయునది. దీనిని సుకుమారులకును గర్భిణీస్త్రీలకును ఉపయోగింపందగదు.

### —॥ మంచుగెడ్డయుపయోగము. ॥—

వాంతులు నిలవక అప్పటప్పటికిని విశేషముగనగుచుండె నేనిమంచుగెడ్డ (అయిస్) ను చిన్నముక్కలుగాజేసి అప్పుడప్పుడును తినిపించుట మంచిది. మరియు లోపలి కుపయోగింపబడు మందులతోడను గంజిమొదలగు నాహారద్రవ్యములతోడను దాహమున కుపయోగించు నీటితోడను మంచుగెడ్డముక్కలను జేర్చి యుపయోగించుట చాలమంచిది.

### —॥ కార్పాసయోగము. ॥—

లేత పైడిపత్తికాయలను తేనెతోనైనను నిమ్మకాయ రసముతోనైనను సానమీద నరగదీసి యాగంధమును కొంచెముగ తేనెతోకలిపి యప్పుడప్పుడును ఇచ్చుచుండుట మంచిది. లేక నాలుకకు వ్రాయుచున్నను వాంతి నిలచును.

### —॥ మాదీఫలయోగము. ॥—

మాదీఫలరసమునకు రెండుభాగములు పంచదారను కలిపి తేలికగా పాకముబట్టి యద్దానిని కొంచెము కొంచెముగ నాలుకకు రాయుచుండిన దుర్ఘటములగు వాంతులును వెక్కిళ్లను దప్పియు తగ్గును.

### —॥ మయూరపింఛాదియోగము. ॥—

నెమలియీకెలు, ఏలకిగింజలు, ఉసిరికెకాయలలోనిపప్పు, రేగుగింజలలోనిపప్పు, తెల్లనిపట్టుగుడ్డ, వీనిని సమభాగములుగ గ్రహించి మంచి మూకుటిలోనునిచి నిప్పుసెగలో వెల్లి

మెల్లగా దోరగమాడిచి దానిని వేడిగనుండునపుడే కల్వమున నునిచి కాటుకవలె మెత్తనగునట్లునూరి వస్త్రగాలితముచేసి యొకసీసాలో భద్రము చేయునది. దీనిని వాంతుల ప్రాబల్యము ననుసరించి తడవ కొకటి రెండు గురుగింజలంతమాత్రము తేనెతోనైనను నిమ్మకాయల షర్బతుతోనైననుకలిపి నాలుకకు పలుమారు రాయుచుండవలెను. ఘోరమగు వాంతులు తగ్గును.

## —॥ మాతులుంగాదియోగము. ॥—

మాదీఫలములతోలును మూకుటిలో నునిచి దోరగ మాడిచి మెత్తగ పొడిచేసి నాలుగైదు గురిగింజలయెత్తు మాదీఫలముల పానకమునగాని తేనెతోగాని కలిపి అరగంట కొకతూరి నాలుకకు పూయుచున్నచో వాంతులు తగ్గును.

## —॥ ఏలాదిచూర్ణము. ॥—

ఏలకులు, నాగకేసరములు, రేగుగింజలలోపప్పు, వరి పేలాలు, తుంగగడ్డలు, మంచిగంధము, పిప్పళ్లు, వీనిని సమ భాగములుగ గ్రహించి మెత్తగ పొడిచేసి యుంచుకొనునది. ఈచూర్ణమున కొంచెము తేనెను చక్కెరను కలిపి వ్యాధి బలము నెరింగి లోపలికి అయిదు యవలుమొదలు పది పదునైదు యవల పరిమితివరకు ఇయ్యవలెను. వాంతులు తగ్గును.

## —॥ ఏలాదికషాయము. ॥—

పొట్టుతోగూడ మెత్తగా నలియకొట్టబడిన జీలకఱ్ఱను, ఏలకికాయలను వేర్వేరుగనైనను రెంటిని చేర్చియైనను ఒక

పాత్రలో నునిచి యందు నాల్గుభాగములు నీళ్లుపోసి నాల్గవ పాలు మిగులునంతవరకును కాచి వడబోసి చల్లార్చి యా కషాయమును అప్పుడప్పుడును కొంచెము కొంచెముగ నియ్య నగును. వాంతులు నిలచును.

—॥ దాడిమయోగము. ॥—

పుల్లదానిమ్మపండ్ల రసమునకు రెట్టింత పంచదారనైనను పటికిబెల్లమునైనను వేసి పాగుపట్టి కాగి చల్లారిన నీటితో కలిపి మాటిమాటికి నిచ్చుట మంచిది. దప్పియు వాంతులును తగ్గును.

—॥ బిల్వమూల కషాయము. ॥—

మారేడువేళ్లకషాయమున కొంచెము తేనెకలిపి యిచ్చిన చో తీవ్రములగు వాంతులు మానును.

—॥ ఉశీరాది కషాయము. ॥—

వట్టివేళ్లు, నేరేడుచిగుళ్లు, మామిడిచిగుళ్లు, దనియాలు, కురువేరు, ఈద్రవ్యములను అన్నిటినైనను కొన్నిటినైనను సమభాగములుగ గ్రహించి యొకకుండలో నునిచి వస్తుసముదాయమునకు ఎనిమిది భాగములు నీళ్లుపోసి యొకటి రెండు పొంగులువచ్చునట్లు కాచి చల్లార్చి కావలసినపుడు ఆచల్లని కషాయమును దీసికొని యందు ఏలకులచూర్ణమునైనను పాదిరిపువ్వులనైనను వాసనకై కొంచెముగ వైచి కొంచెము తేనె జేర్చి కొంచెముకొంచెముగ లోనికిచ్చినయెడ వాంతులుతగ్గును.

## —॥ వటాంకురాదిక పాయసము. ॥—

మఱ్ఱిచిగుళ్లను మామిడిచిగుళ్లను సమభాగముగ గ్రహించి ద్రవ్యములకు ఎనిమిదింతలు నీళ్లుబోసి యొకటి రెండు పొంగులు వచ్చునంతవరకు కాచి వడియగట్టి చల్లార్చి అప్పుడప్పుడును కొంచెముకొంచెముగ నిచ్చుచుండిన వాంతులు తగ్గును.

## —॥ అజమోదాదిక పాయసము. ॥—

రెండుతులములు ఓమము, రెండుతులములు ఏలకిగింజలు, రెండుతులములు నిమ్మకాయతోలు, వీనిని మూకుటిలో నునిచి సన్నపుసెగమీఁద బెట్టి దోరగ మాడుసమయమున నొకసేరునీళ్లను మూకుటిలోబోసి వెంటనే మూత నిడవలెను. ఒకపొంగు వచ్చినమీఁద దించి వడియబోసి చల్లార్చి యీకపాయమును కొంచెముకొంచెముగ నిచ్చిన వాంతులు తగ్గును.

## —॥ తండులకణాదిపానీయము. ॥—

బియ్యపునూకలను ఉసిరికెకాయ గింజలలోని పప్పును ప్రత్యేక మొక్కొకపలమును గ్రహించి దోరగమాడ్చి యందొకసేరు నీళ్లుపోసి యొకపొంగు వచ్చునంతవరకు కాచి వడియగట్టి చల్లార్చి యానీటిని కొంచెము కొంచెముగ నిచ్చుచుండవలెను. వాంతులు నిలుచును.

## —॥ లాజపానీయము. ॥—

మూఁడు తులముల వరిపేలాలు రెండు శేర్ల నీళ్లలోకలిపి వకటి రెండు పొంగులువచ్చునట్లు కాచి వడియకట్టి యందు

కొంచెముగ నుప్పువేసి కలిపి మాటిమాటికిని యిచ్చుచుండ వలెను. వాంతులు నిలచును. రోగికి బలము కలుగును.

—౹ జీరకపానీయము. ౹—

జీలకఱ్ఱను చనుపాలలోనూరి వడియగట్టియైనను లేక పట్టి చనుబాలనైనను మాటిమాటికి త్రాగించుట మిక్కిలి యుక్త ముగనుండును. దీనివలన వాంతులు తగ్గుటయేగాక వెక్కిళ్లు మొదలగు నుపద్రవములుకూడ మానును.

—౹ మృత్ఖండపానీయము. ౹—

పాటిమట్టిగెడ్డ, పాతకుండపెంకు, నల్లని యిసుక వీనిలో నెద్దానినైనను నిప్పులలో నెఱ్ఱనగునట్లు కాల్చి నీళ్లలోవైచి యానీళ్లనువడియగట్టి చల్లార్చి యిచ్చుచుండిన దప్పియు వాంతు లును మానును.

—౹ వెక్కిళ్లు వానిచికిత్స. ౹—

కలరావ్యాధియం దుపద్రవరూపముగ వెక్కిళ్లు గల్గును. ఈవ్యాధియందుకల్గు నుపద్రవములలో నియ్యది మిక్కిలి క్రూర మైనది. అట్టి యుపద్రవము కల్గినమాత్రముననే వ్యాధియొక్క యంతిమదశయని నిశ్చయించి యనేకులు చికిత్సల జేయుటమాని నిరాశ జెందుదురు. వెక్కిళ్లు ప్రాయికముగ నీవ్యాధియొక్క యంతిమదశను సూచించునది యనుట నిక్కమే. అయినను అందును భేదములుగలవు. కావున జ్ఞానవంతులగు వైద్యులు వ్యాధిదశను నిశ్చయించునంతవరకును చికిత్సల మానుట ప్రతనము.

—౽ కీటమృద్యోగము. ౽—

కందిరీగ గూడునుదెచ్చి యందు కందిరీగ రెక్కలు మల ము మున్నగునవి లేకుండ శుభ్రముజేసి మెత్తగనూరి నాలు గైదు గురిగింజలయెత్తు మోతాదులు తేనెతోనైనను మంచి నీళ్లతోనైననుకలిపి ఇయ్యవలెను. రెండుమూడు మోతాదుల నుపయోగించునంతలో క్రూరములగు వెక్కిళ్లు నివర్తించును.

—౽ అజాజీయోగము. ౽—

జీలకఱ్ఱ, పటికిబెల్లము, లేక బెల్లము, ఈవస్తువుల సమ భాగములుగ జేర్చి తేనెతోనూరి చిన్నయుండలుగ జేసి యాయుం డల పుక్కిట నిడికొని దానిరసమును మ్రింగుచుండిన వెక్కిళ్లు నిలచును. అట్లు పుక్కిటనుంచుకొనుటకు తగిన శక్తి లేనిసమయ మున పైజెప్పిన యుండలను చల్లని నీటిలో కొంచెముగ కలిపి లోపలికి త్రాగింపందగు. లేక కొంచెముగ తేనెతో కలిపి తిని పించవలెను.

—౽ మిరియపుగుటికలు. ౽—

మిరపకాయలపొడి ప. ౧. బెల్లము ప. ౪. ఈరెండిటిని చేర్చి మెత్తగా కలియనూరి గురిగింజలవలె మాత్రలజేసి సమ యముతెరింగి యొకటి రెండుతడవలు తేనెయనుపానముతో నిచ్చునంతలో వెక్కిళ్లు మానును. ఇయ్యది సుకుమారుల కును గర్భిణీస్త్రీలకును ఇయ్యదగదు.

—౽ నిశాధూమము. ౽—

పసుపుపొడిని ఒక కాకితములోబోసి చుట్టచుట్టి చుట్టను కాల్చువిధముగ పొగను పీల్చినచో వెక్కిళ్లు మానును.

—॥ ఏలాదిధూమము. ॥—

ఏలకులపొట్టు, పట్టుగుడ్డ, పాతగోనెచింపి, పెసలపొట్టు, వీనిని పైజెప్పినరీతిగ చుట్టజుట్టి పొగ పీల్చినచో వెక్కిళ్లు నిమ్మళించును.

—॥ జీరకాదిపానీయము. ॥—

జీలకఱ్ఱ, పుల్లదానిమ్మగింజలు, ఈరెండిటిని సమముగ జేర్చి నలుగగొట్టి నాలుగింతలు నీళ్లుబోసి కాచివడియగట్టి చల్లార్చియిచ్చినచో వెక్కిళ్లుమానును.

—॥ కార్పాసపానీయము. ॥—

ప త్తిగింజలలోని పప్పును ఏలకిగింజలను సమముగ జేర్చి నాల్గుభాగము లధికమగు నీటితోగలిపి కషాయముకాచి వడియ గట్టి చల్లార్చి యందు పటికిబెల్లమును కొంచెముగ జేర్చియిచ్చిన వెక్కిళ్లు మానును.

—॥ బిల్వాదిపానీయము. ॥—

పచ్చిగనుండు మారేడు వేరుపైబరడు—లేక దానియాకు ఏలకులు, నాగకేసరములు, దాచినిచెక్క, వీనిని సమభాగ ములుగ జేర్చి నలుగగొట్టి నాలుగింతలు నీళ్లుపోసి కషాయము కాచి నాల్గవపాలు మిగిలియుండగ దించివడియగట్టి చల్లార్చి భద్రముగ నుంచునది. ఈకషాయమును కొంచెము కొంచె ముగ నిచ్చినచో వెక్కిళ్లు మానును.

వేయించబడిన పాతబియ్యము పలములు. ౧. పచ్చి మారేడాకు. పలములు. ౧. ఈరెంటిని రోటిలోనునిచి దంచి

యావమా కేడాకును చెరిగివేసి బియ్యమునుమాత్రము ఒక సేరు నీళ్లుపోసి యొకటి రెండు పొంగులువచ్చునంతకు కాచి వడియగట్టి ఇచ్చుచుండిన మిక్కిలి క్రూరములగు వెక్కిళ్లు మానును.

మంచినీళ్లుకల చెరువుల సమీపముననుు, లేక కాలువ గట్టులయందైనను వరిచేలగట్టులయందైన నుండు పీత బొక్కలలోని నీటిని దెచ్చి వడియగట్టి కావలసినపుడెల్ల కొంచెముకొంచెముగ త్రాగించినచో ఘోరములగు వెక్కిళ్ళు నిమ్మళించును.

## —॥ తృష్ణ (దప్పి.) ॥—

కలరావ్యాధియందు దప్పికూడ బలిష్ఠమైనయుపద్రవము. ఈయుపద్రవము కలరావ్యాధి వృద్ధినొందుకొలదియు శరీరము నంగల సౌమ్యములగు ద్రవధాతువులుతగ్గి నోటనీటియూటతగ్గుచు తడియారుటవలన కలుగును. క్రమముగ నాలుకయందు తడి కొంచెమైన లేక తాటిపట్టయంచులవలె గరగరలాడుచుండును. ఈలక్షణము లధికములగుకొలది దప్పియోర్వ శక్యముగాక యెన్నినీళ్లుత్రాగినను శమించక వృద్ధియగుచుండును. అట్టిదప్పి కలిగినపుడు సహజముగ మనవారలు గ్రుక్కెడు నీళ్లనిచ్చినను అయ్యది విశేషముగ శీతలముం జేయుననియు ప్రమాదజనకమనియు తలంచి జలమును కొంచెమైన నియ్యరు. * తృష్ణానిరో

* "తృష్యన్ పూర్వామయక్షీణో న లభేత జలం యది । మరణం దీర్ఘరోగం వా ప్రాప్నుయాత్త్వరితం నరః । తృషితో మోహమాయాతి మోహాత్ప్రాణాన్ విముఞ్చతి । తస్మాత్సర్వాస్వవస్థాసు న క్వచి ద్వారి వార్యతే" బృందమాధవము తృష్ణాచికిత్స.

ధముచే (దప్పివేగమును అడంచుటచే) గల్గు నుపద్రవముల దెలియక మనవారు మూఢులై జలము నియ్యకుండుటంజేసి యనేకసమయముల రోగులకు దీర్ఘవ్యాధులు గల్గుటయేగాక యొకసమయమున ప్రాణహానియు గల్గుచున్నది. కావున దప్పి కల్గకుండ కాపాడుట ప్రథమోద్యమము. అంతనిలువక దప్పికలిగెనేని తోడనే దానినడంప చల్లటినీటికి సమమగునది వేరొండు లేదు. మంచినీళ్లతో వట్టివేరు పాదిరిపూవులు మొదలగు ద్రవ్యములకలిపి యియ్యనగును. నీటియందు మంచుగడ్డను వైచి యియ్యవచ్చును. సోడామొదలగు పానీయముల నియ్యనగును. తరవాణినీళ్ళు (కూటినీళ్ళు-పుల్లనీళ్ళు) ఇచ్చుట మంచిది. ఈ నీటియందు పంచదార నిమ్మకాయలరసమునుకలిపియిచ్చుట యుచితము. పైవాటిలో కూటినీటితో సమానమైనది వేరు లేదు.

## —) దప్పి తగ్గుటకు చికిత్స. (—

### —) తక్రపానీయము. (—

పలుచని నీటిమజ్జిగను పెరుగుమీద తేటనీరును అప్పుడప్పుడు ఇచ్చుచుండుట మంచిది. ఇందు అవసరమున్నచో కొంచ ముప్పును కొంచము నిమ్మకాయరసమును కూడచేర్చి యిచ్చుటయు మంచిది. దీనినుండి క్రూరమగుదప్పియు వాంతులును తగ్గును.

### —) నింబపానీయము. (—

లేత వేపచిగుళ్లను నాలుగింతల నీళ్లలోవేసి రెండు మూడు పొంగులు వచ్చునంతవరకు కాచి వడియగట్టి చల్లార్చి యిచ్చుచుండిన దప్పి యణంగును.

### —౹ మధుపానీయము. ౹—

మూడుతులముల తేనెను అరసేరు చల్లనినీటిలో కలిపి కొంచెముకొంచెముగ నిచ్చుచుండిన దప్పి తగ్గును. లేక కావలసినంతమాత్ర మొక్కసారిగ నిచ్చినను వాంతియు దప్పియు నడంగును.

### —౹ ఖర్జూరాదిపానీయము. ౹—

ఖర్జూరపుకాయనైనను అతిమధురమునైనను పర్పాటకమునైనను రెండుతులములు తెచ్చి యొకసేరునీళ్ళు వేసి యొకటి రెండు పొంగులు వచ్చువరకు కాచి చల్లార్చి యానీటిని దప్పి తగ్గునంతవరకు కొంచము కొంచము ఇయ్యవచ్చును. దప్పి నయమగును.

### —౹ తండులపానీయము. ౹—

చిట్టుదుకు (బియ్యము ఉడుకుట కారంభించునప్పుడు వేడిగ కాగియుండు) నీటిలో కొంచెముగ నిమ్మకాయరసమును ఉప్పును కలిపి డప్పి యణంగువరకును కొంచెము కొంచెముగ నిచ్చుటచే దప్పితీరును.

### —౹ హిమాంబుపానీయము. ౹—

మంచుగడ్డ దొరకినచో ముక్కలుం జేసి కొంచెముకొంచెముగ నిచ్చుచుండుట చాలామంచిది. మంచుగెడ్డనిచ్చిన శీతలము గ్రమ్మునని మనవారు చాలాభయపడుదురుగాని యొకప్పుడును అటులు కానేరదు. మిక్కిలి ధైర్యముతో సంశయింపక ధారాళ

ముగనుపయోగింపనగును. క్రూరమగు దప్పి వాంతులు మాయ మగును.

—॥ ద్రాక్షాదిగండూషములు. ॥—

ద్రాక్షపండ్లరసము, చెరకురసము, తేనె, బెల్లము-లేక పంచదారపానకము, తేటనగు చింతపండు పులుపునీరు, పుల్లనైయుండు దానిమ్మమొదలగువానిరసము, వీనిలో దేని నైన కొంచెముగ నోటనుంచుకొని నాలుగైదుతడవలు గండూ షముచేసినచో మిక్కిలి క్రూరమగు దప్పితగ్గును. లేక పైజె ప్పిన పండ్లరసమును కొంచెముగ నీటిలోకలిపియు నిచ్చిన దప్పి నెమ్మదిసెందును.

రోగి కోరునపుడెల్ల వట్టిచలినీళ్లనుమాత్రము నియ్యం జనదు. పైజెప్పినరీతిగ సంస్కారముచేసి యుపయోగించునెడ వ్యాధిబలముతగ్గి త్వరలో స్వస్థమగును.

—॥ చలవ గ్రమ్మట దానిచికిత్స. ॥—

కలరా వ్యాధియందు శరీరమంతయు అల్లికలవకాడలవలె చల్లబడుట యొక లక్షణమైయున్నది. ఈ చలవ ముందుగ కాళ్లయందైనను చేతులయందైనను లేక రెంటియందైనను ప్రారంభమయి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించును. ఇయ్యది శరీరమునందలి రక్తముయొక్క బలము క్షీణించుట వలన కలుగును. చలువ కనుపించినతోడనే తగుచికిత్స జేసినచో వెంటనే తగ్గును. ఉపేక్షించినచో క్రమముగ శరీరమునందెల్ల

వ్యాపించును. కావున శీతలము శరీరమునందెల్ల వ్యాపించి నాడి క్షీణించకమునుపే తగుచికిత్సకుని యనుమతిచేనైనను స్వయముగనైనను వైద్యుని మూలముననైనను త్వరితముగ చికిత్సంజేయ యత్నించుట ముఖ్యకర్తవ్యము.

—॥ కస్తూరిప్రయోగము. ॥—

పైజెప్పినరీతిగ చలువ గ్రమ్మినపుడు తోడనే శరీరమున మిక్కుటముగ చెమటగారును. మూత్రముతగ్గును. నాడి క్షీణదశనొందును. అట్టి దుర్గుణములమాన్పి చలువను పోగొట్టుటకై కస్తూరివంటి పదార్థము వేరొండులేదని దృఢముగ జెప్పవచ్చును. కావున కస్తూరిని రోగియొక్కవయస్సును వ్యాధిబలమును అనుసరించి తడవకు అరగురిగింజయెత్తు మొదలు రెండుగురిగింజలయెత్తువరకు తేనెతోనైనను చనుబాలతోనైనను కలిపి ఇయ్యనగును. మద్యపాన మలవాటుగా నున్నవారికి కొంచెము బ్రాందితోనైనను మంచిసారాయితోనైనను కలిపి యిచ్చుటమంచిది. చలువ తగ్గునంతవరకును గంటకొకతూరి యిచ్చుచుండిన క్షీణించిన నాడికి బలముకలిగి శరీరమునకు సమమగునుష్ణమును కలుగంజేయును.

—॥ కస్తూర్యాదివటి. ॥—

కస్తూరి, కుంకుమపువ్వు, శుద్ధిచేసిన వత్సనాభి, జున్నుపావుదారు, గోరోచనము, మిరియాలు, వీనినన్నిటిని సమభాగములుగ గ్రహించి కస్తూరిగాక తక్కినవానిని చిత్రమూ

లవు రసముతో నాలుగైదుదినములు కొటుకవలె మెత్తగా నట్లునూరి పిమ్మట కస్తూరిని చేర్చి జిట్టవరగోగుకషాయముబోసి యైనను చిత్రమూలవు స్వరసమును బోసియైనను అయిదారు దినములునూరి పెసలవలె మాత్రలంజేసి నీడనెండించి సీసాలో భద్రముగ నుంచవలెను. ఈ మాత్రలను వయోభేదమును రోగబలమును జూచి తడవ కొకటిమొదలు మూడునాల్గు మాత్రలవరకు తేనెలోచాది యియ్యవలెను. ఈరీతి నరగంట కొకతూరివంతున శీతలముతగ్గి నాడికిబలము గల్గువరకు ఇచ్చుచుండవలెను.

చలువగ్రమ్మి నాడి క్షీణించి విరేచనము లగుచున్న పైనుదహరించిన 'కస్తూరీకల్పరసము' ఉపయోగింపనగును.

చలువతగ్గక నాడిక్షీణించి యున్నయెడల "గరళ కాలకూటము" "సింహప్రతీపానలము" "వాతగజాంకుశము" అను సీయౌషధములను తగిన వైద్యసహాయమును బొంది యుపయోగించిన మిక్కిలి గుణకారిగనుండును.

—) చలువకు బాహ్యోపచారములు. (—

—) శిగ్రుత్వగాదిలేపము. (—

మునగచెక్కను చక్కగా పొడిచేసి దానితో హారతి కర్పూరమును పసుపుపొడిని జేర్చి మెత్తగాకొట్టి శరీరమునందంతటను రుద్దవలెను. లేక మునగచెక్కనుమాత్రము పొడిచేసి రుద్దవలెను. చలువ తగ్గునంతవరకు అరగంట కొకతూరి రుద్దవలెను.

—౹ లశునాదిలేపము. ౹—

వెల్లుల్లిపాయలను చక్కగానొలిచి పైపొట్టుదీసి మెత్తగానూరి యరికాళ్లకును అరిచేతులకును రుద్దవలెను. దానిని బ్రాందితోకలిపియు రుద్దవచ్చును. గంటకొకతూరి రుద్దినచో చలువమాని యుష్ణముకలుగును.

—౹ కర్పూరతైలాది లేపము. ౹—

కర్పూరతైలమునైనను ఉడుకులామునైనను శరీరము నందంతటను రుద్దవలెను. అరగంట కొకతూరి రుద్దుచున్న చలువ తగ్గును.

—౹ సర్షపాదిలేపము. ౹—

ఆవాలపిండిని కర్పూరమును సమముగ కలిపి కాళ్లకును చేతులకును రుద్దవలెను. శరీరమునం దంతటను గ్రమ్మియుం డునట్లు కంబళ్లచే గ్రప్పవలెను. చలువ తగ్గి వేడిగలుగును.

—౹ కర్పూరాదిలేపము. ౹—

హారతికర్పూరమును పసుపుపొడిని ఉలవపిండిని సమముగ జేర్చి కాళ్లుచేతులకును శరీరమునందంతటను చలువ తగ్గునంతవరకు రుద్దుచుండవలెను. చలువ తగ్గును.

—౹ కుళుత్థాదిలేపము. ౹—

ఉలవపిండి, మెత్తగాతాల్చిన కచ్చికబూడిదె, పసుపుపొడి, వీనిని సమముగజేర్చిగాని వెవ్వేరుగగాని చలువ తగ్గునంతవరకు మాటిమాటికి రుద్దవలెను.

### —౹ సైకతాదిస్వేదము. ౹—

ఇసుక, ఉప్పు, కందులు, ఇటికెరాతిపొడి, గోధుమల పొట్టు, తవుడు, మొదలగువానిని మూకుటిలో వేసి వేచి గుడ్డలోబెట్టి యోర్వదగినంత వేడియుండునట్లు దేహమునకు కాపుపెట్టవలెను. కంబళిచే దేహమంతయు గప్పనగును. శీతలముతగ్గి వేడినిగల్గించును.

### —౹ ఉష్ణోదకోపచారము. ౹—

వేడినీళ్లతో నింపిన సీసాలను నీరు కారకుండునట్టులు మూతికి మంచి బిరడాలుమూసి బిగియించి యాసీసాలను చలువగ్రమ్మిన రోగికి నలుప్రక్కలనుంచి పైన కంబళ్ళచే గప్పటమంచిది.

### —౹ { కాళ్లు చేతులు నరములు లాగుటకును, కొంకరలుబోవుటకును చికిత్స. } ౹—

కలరావ్యాధి మిక్కిలి యభివృద్ధినొందినదనుటకు కాళ్ల యందును చేతులయందును నరములు లాగుటయు కొంకరలు బోవుటయు నొకలక్షణముగనున్నది.

ఇట్టి క్రూరదశయందు వాతగజాంకుశము మిక్కిలి చక్కగ పనిచేయనోపును. మరియు చలవతగ్గుటకై పైజెప్పిన మునగచెక్కపొడి మొదలగు బాహ్యోపచారములును హితముగ పిసుకుటయు మంచిది.

మరియు విఖ్యాతములగు నారాయణతైలము, ప్రసారిణీతైలము, అర్కక్షీరతైలము, మొదలగు తైలములనుబూసి కొంకరలణగువరకు రుద్దుచుండవలెను.

—( మూత్రమును వెడలించు నుపాయములు. )—

కలరావ్యాధియందు విశేషముగ మూత్రముబంధించుట యొక యుపద్రవమైయున్నది. శరీరమునందలి సౌమ్యములగు ద్రవధాతువులన్నియు విరేచనరూపముగ బోవుటయు సహజము. దానంజేసి మూత్రము బైటవెడలక బంధించియుండుటయు కలదు. కొన్నిసమయములయందు విరేచనము లగుచున్నను కాకున్నను మూత్రము బంధించుటయు కలదు. ఇట్టి దురవస్థలోనసేకులు అయిదారు దినములవరకును జీవించియుండెదరు. సకాలమునకు దగిన యుపచారములం జేసినచో నిట్టి క్రూరావస్థగూడ శమించి జయమును గాంచనగును.

మూత్రమును బంధించి వమనవిరేచనములు రెండును లేక విరేచనములు మాత్రంబైనను అగుచున్నయెడ అట్టి విరేచనముల కట్టుటకై నల్లమందుతో జేరిన యేమందునైన నుపయోగింపంజనదు.

చలువలేకయే మూత్రము బంధించినను, లేక చెమట వడియుచు మూత్రము బంధించినను ఈక్రింద గనుపరపబడిన యుపచారముల జేయుట యవసరము. లేనిచో దగువైద్యుని సహాయము నపేక్షించుట యుచితము,

## —॥ మూత్రము స్రవించుట కుపాయములు. ॥—

రెండు శేరులనీళ్లలో పదెనిమిది గురిగింజలయెత్తు మణి ను రేకారమునువేసి కాచి యావేడినీటిలో కంబళిబట్టను తడి నీరుపిండి వేడిగానుండు నాకంబళిబట్టచే పొత్తికడుపున పది మారు కాపుకాచవలెను. గంటకొకతూరి పదిపదునైదు నిమిష ములకాలము కాచుచుండిన మూత్రము వెడలును.

## —॥ సురాక్షారాదిలేపము. ॥—

సురేకారము, రేవలచిన్ని, ఈరెంటియందును బ్రాంది సారాయి, గోమూత్రము, ఈ మూడిటిలో నొకదాని కలిపి మెత్తగ గంధమువలె నరగదీసి పైజెప్పిన కాపుపెట్టి పదినిమిషములకు పొత్తికడుపుమీద పట్టువేయుట యుచితము. ఈకాపును పట్టును రెండుతడవలు చేయులోపల మూత్రము ధారాళముగ స్రవించును.

## —॥ ఇక్షురాది క్షారలేపము. ॥—

నీరుగొబ్బిని సమూలముగ నొకమూకుటిలో నుడి మాడిచి బూడిదెచేసి యాబూడిదెను కొంచెము సురేకారము గోమూత్రముతో నూరి పొత్తికడుపుమీద పట్టువేసినచో మూత్రము ధారాళముగ వెడలును.

పైజెప్పినవానితో రాతికాయ నరగదీసి పట్టువేసి మూత్రము వెడలును.

—॥ సురాష్ఠ్రారాదిపానము. ॥—

మంచిసురేకారమును తడవకు రెండుమొదలు ఆరు గురిగింజల యెత్తువరకు ఒకశేరు నీటిలోఁగలిపి తడవ కొక గ్రుక్కెడు నీళ్లవంతున గంటకొకతూరి యిచ్చుట మంచిది.

పైజెప్పిన పట్టులను కాపును వేసినను మూత్రము ధారాళముగ వెడలకున్నచో నీచికిత్సను జేయవలెను.

—॥ పునర్నవాదికషాయము. ॥—

తెల్లగలిజేరువేళ్లనైనను, ఏనుగుపల్లేరుకాయలనైనను, పల్లేరు సమూలమునైనను నలుగగొట్టి రెండుపలముల పరిమితముగ గ్రహించి యొకసేరు నీళ్ళుపోసి నాలుగైదు పొంగులు వచ్చునందాక కాచి వడియగట్టి చల్లార్చి యాకషాయమున కొంచెము బ్రాందినికలిపి యెనిమిది గురిగింజలయెత్తు మంచి సురేకారమును కూడకలిపి యుంచునది. చెమటలు విశేషముగ నుండి మూత్రము వెడలనిసమయమున పైజెప్పిన కాపునువేసి పట్టును బెట్టుచు నీకషాయమును గంటకొకతూరి తడవకు గ్రుక్కెడువంతున త్రాగించినచో మూత్రముజనించి ధారాళముగ వెడలును.

—॥ దూర్వామూలాది కషాయము. ॥—

పచ్చగరికవేళ్లు, చెరకువేళ్లు, దర్భవేళ్లు, ప్రాచికవేళ్లు, రెల్లువేళ్లు, వరిగడ్డివేళ్లు, వీనిలో నొకదానినైనను కొన్నిటినైనను అన్నింటినైనను పచ్చివిగదెచ్చి మెత్తగ నలుగగొట్టి

దానికెనిమిదింతలనీళ్లుపోసి రెండు మూడుపొంగులు వచ్చునంత వరకును కాచి వడియగట్టి చల్లార్చి యుంచునది. మూత్రము బంధించి మెట్టెయవస్థలోనున్నను పైనుదహరించిన కాపుల పట్టులను వేయుచు నీకషాయమును గంట కొక గ్రుక్కెడు యిచ్చిన మూత్రము గలిగి నిరాటంకముగ వెడలును.

—{ చలువయు చెమటయు లేక మూత్రము బంధించి యున్నపుడు చేయదగిన చికిత్స. }—

డప్పి యధికముగనుండి చలువలు గ్రమ్మక బంక చెమటలు లేక మూత్రము బైటరాక బంధించియుండునపుడు లేత కొబ్బరికాయనీళ్లను అప్పుడప్పుడును ఇచ్చుచుండుట మంచిది.

—{ మూలకాది స్వరసము. }—

ముల్లంగిదుంపలను అరటియూచలను సమభాగములుగ గ్రహించి రోటవేసిదంచి రసమునుదీసి యందు కొంచెము తాటికల్కండనుకలిపి గ్రుక్కెడు త్రాగించవలెను. దీనిని గంట కొకతూరి త్రాగుచున్న మూత్రము నిరాటంకముగ వెడలును.

—{ పాషాణభేది కషాయము. }—

పిండికొండ, దోసగింజలు, ఈరెండిటిని ఒక్కొక పలము వంతున గ్రహించి నలుగగొట్టి మూకుటిలోనునిచి యొక సేరు నీళ్లుబోసి రెండుమూడు పొంగులువచ్చునట్లు కాచి వడియగట్టి చల్లార్చి యందు తాటికల్కండను కొంచెముగ కలిపి గంటకు గ్రుక్కెడువంతున త్రాగించినచో మూత్రము జల్లని వెడలును.

—॥ మూత్రబంధమున క్షారప్రయోగము. ॥—

పైజెప్పిన చికిత్సల నుపయోగించినను మూత్రము వెడలక బాధపడుచుండువారలకు క్రింద చెప్పబడు ప్రయోగముల నుపయోగించినచో మిక్కిలి యుపకారకములై యుండును.

—॥ అపామార్గాది క్షారయోగము. ॥—

ఉత్తరేణి, నీరుగొబ్బి, అరటి, ముల్లంగి, మొదలగు వానిని క్షారకల్పమున జెప్పినప్రకారము క్షారముజేసి యాక్షారములనైనను, సర్జక్షారమునైనను, యవక్షారమునైనను, రోగియొక్క బలమును రోగముయొక్క స్థితిని పరిశీలించి తదనుసారముగ నొకటినుండి మూడు గోధుమగింజలంత పరిమితిని పైజెప్పిన కషాయములలో నొకదానితోనైనను లేక బారలిబియ్యపు గంజితోనైనను కలిపి గంటకొకతూరి యిచ్చినచో నెట్టి క్రూరమగు మూత్రబంధములునువదలి మూత్రముధారాళముగ వెడలును.

—॥ ఇక్షురాదికషాయము. ॥—

నీరుగొబ్బినిదెచ్చి నలగగొట్టి యెనిమిదింతల నీళ్లుబోసి యొకటిరెండుపొంగులు వచ్చునంతవరకు కాచి వడియగట్టి చల్లార్చి తడవకొక గ్రుక్కెడువంతున రెండుగంటలకొకతూరి యిచ్చిన మూత్రము వెడలును.

—॥ శిలాఫలాదిపానము. ॥—

రాతికాయను సానమీద నిమ్మకాయరసముతో గంధముతీసి నరగచాది వృల్లనితరవాణినీళ్లలో పావుతులము కలిపి

యిచ్చినచో వెంటనే మూత్రము వెడలును. అవసరమునుబట్టి గంటకొకతూరి యిచ్చుచుండవలెను.

మూత్రము ధారాళముగ వచ్చునంతవరకును పైజెప్పిన కషాయములను, వేడికాపడములను, పట్లను సాధ్యమగునంత వరకు చేయుచుండవలెను.

మరియు బార్లేబియ్యపు తేటగంజిని తరవాణినీళ్లను కలిపి యిచ్చుచుండవలెను. మూత్రమును అనాయాసముగ వెడలించుటలో నింతకన్న వేరుప్రక్రియ కానరాదు. ఇయ్యది మూత్రమును వెడలించి రోగికి బలమునుకూడనిచ్చును.

మరియు మిక్కిలిక్రూరమగు మూత్రబంధమున చింతామణియందుజెప్పిన శంఖద్రవమును క్షారజద్రవములను మూడు నాల్గు బొట్లను గుక్కెడు నీళ్లలోకలిపి యిచ్చుట యుచితము. వీనినిమాత్రము గర్భిణీస్త్రీలకును పసివారలకును వృద్ధులకును నుపయోగింపఁజనదు.

---

## చతుర్థప్రకరణము.

### —॥ కలరారోగుల నుంచవలసిన నియమములు. ॥—

కలరావ్యాధి తగిలినదని తెలిసినతోడనే యారోగిని తత్కాలమున సమీపమునమండు దొరతనమువారి చికిత్సాలయములకుగాని యిందుకై ప్రత్యేకముగ నియమితములగు వైద్యాలయములకుగాని పంపుట మంచిది. అచ్చటను

చికిత్సకులు రోగికి తగిన యనేక సౌకర్యముల నేర్పరిచి ఆయా సమయములనెరింగి తత్తదుచితముగ చికిత్సల జేయుదురు. తగిన పరిచారకుల నియమించి సమయోచితములగు నుపచారముల జేయ నియమించెదరు. ఇట్లు చేయుటకు మనము కొంత ద్రవ్యవంతులుగనున్నను రోగులకు సమయోచితముగ తగు సదుపాయముల జేయజాలము. కావున రోగిని రోగ ప్రారంభదశయందే చికిత్సాలయమునకు బంపుట యుచితము. చికిత్సాలయములకు రోగిని బంప నిష్టములేకున్నను, చికిత్సాలయములు దూరమున నున్నను రోగిని యీ క్రింద గనబరచు విధముగ నునిచి యౌషధముల నుపయోగించుచు తగిన యుపచారములు చక్కగ జరుగునట్లు తగిన యేర్పాటు చేయవలెను.

12/27

— రోగిని ప్రత్యేకముగనుంచు సదుపాయములు. —

ఈవ్యాధి తగిలినతోడనే రోగగ్రస్తుని శుభ్రముచేయబడి మంచిగాలి వీచుచుండు ప్రత్యేకస్థలముననైనను, మంచిగాలి వచ్చు గదియందైనను ఉంచవలెను. రోగిని నుంచుచోట మలినములగు బట్టలు పెట్టెలు పరుపులు మొదలగు సామానుల నుంచకూడదు. ఇట్టి సౌకర్యములుగల యిండ్లు లేనివారు మిక్కిలి విశాలమై శుభ్రమై గాలివీచుచుండు గసెలోనైన నుంచవలెను. రోగి నివసించుగది యొక్కవాకిళ్లకును కిటికీలకును పచ్చివేపాకుతోరణములను ప్రతిదినంబు

ఉదయకాలమున కట్టుచుండవలెను. గదిని ప్రతిదినంబును రెండు మూడు తడవలు చక్కగ నూడిచి యందు వేపాకు వస హారతి కర్పూరము ఈమూడిటిని వేసి కాచబడిన నీటినైనను వేడినీళ్లనైనను చిలకరించవలెను. ఆగదిలోనికి గాలి నిరాటంకముగ వచ్చిపోవునట్లు వాకిటితలుపులను కిటికీలతలుపులను తెరిచియుంచవలెను. ఆగదియందుగాని సమీపమునగాని గంధకము, సాంబ్రాణి, దశాంగము మొదలగువాని ధూపములు విడువక వేయుచుండవలెను. ఆగదిలోనికి రోగికి పరిచర్యచేయువారు దక్క నితరులెవ్వరును పోకుండ నియమించవలెను. రోగిని యితరులతో మాటలాడ నియ్యగూడదు. అవసరమున్నపుడు పరిచారకులు నెమ్మదిగా మాటలాడి తగుపరిచర్యల జేయవలెను. అటుగాక బంధువులు మిత్రులు మున్నగువారితో నిచ్చవచ్చినట్టులు మాట్లాడినచో నాయాసము మున్నగు నుపద్రవములు జనియించును. విశేషముగ బడలికయు సంభవించును.

—{ రోగిని పరుండబెట్టుట. }—

రోగిని మెత్తనిపరుపుపై పరుండబెట్టుట మంచిది. రోగి నెంతమాత్రము కూర్చుండ నియ్యజనదు.

—{ వస్త్రములు శుభ్రపరచుట. }—

రోగి కుపయోగింపబడిన బట్టలు దుప్పట్లు మొదలగు వానిని వసను వేపాకును కర్పూరమును వేసి కాచబడిన నీటిలో నడిపి యుడకబెట్టి యెండవేయవలెను. రోగియొక్క మలము, మూత్రము వాంతి మీనిచే దడిసినగుడ్డలను పైజెప్పినరీతిగ నీటిలో

నుడికించియైనను మరియొకవిధముగనైనను శుభ్రపరచి యెండ వేయవలెను. వీని నితరు లెవ్వరు నుపయోగింపకూడదు. రోగికి నుపయోగించిన చిన్నచిన్నబట్టలను మలము మున్నగు వాని తోగూడ దూరమున నొకగోతిలో నునిచి పైజెప్పిన వేడి నీళ్లతో కలిపిన మట్టిని పైన నునిచి పాతిపెట్టవలెను. లేక అట్టి మలినవస్త్రాదులను కొంతచెత్తను ఊముకను జేర్చి వెంటనే కాల్చి వేయుట సర్వోత్తమము. అట్టి మలాదులగలసిన బట్ట లను ఇతరవస్తువలును ప్రమాదముచేనైనను వీధులు దొడ్లు మున్నగు స్థలములలో పారవేయదగదు. దీనినిమాత్రము మరువక జ్ఞప్తినుంచుకొనుట యావశ్యకము. అట్టి మలినవస్త్రా దులను అప్పుడే కాల్చక కొందరు చికిత్సకులు జేయునటుల విష పరిహారమనందగు నీటిలో కొన్నిగంటలకాలము వేసియుంచ టయు పిదప కాల్చుటయు లేక పాతిపెట్టుటయు తగదు.

రోగి కప్పుడప్పుడును శరీరమున వెడలు చెమటను బట్టచే తుడుచుచుండవలెను. అట్లు తుడిచినగుడ్డలను పైజెప్పినట్టుల కాచబడిననీటిలో నుడికించి యుతికి ఆరవేయవలెను.

—॥ పాత్రలు. ॥—

రోగికి మందులనిచ్చిన పాత్రలను పైజెప్పిన నీటిల కడిగి యుంచవలెను. రోగి యాహారమునకై వినియోగించి పాత్రలను కొంతసేపు నిప్పులలో పొరలించి పిదప చక్కగతో పైజెప్పిన వేడినీటిలో శుభ్రము జేయవలెను.

—| ఆహారపదార్థములు. |—

రోగి భుజియింపగా మిగిలిన గంజి మున్నగు నాహారపదార్థములను పానీయములను ఇతరులెవ్వరు నుపయోగింపం జనదు. వానిని చెత్తతోకలిపి కాల్చివేయవలెను. లేక గోతి లోనునిచి పాతిపెట్టవలెను.

—| బంధువులు చూడకుండుట. |—

రోగికి పరిచర్యజేయువారుదక్క వేరెవ్వరును రోగిక డకు పోకూడదని పైనదెలిపియుంటిని ; ఏలయన ? కలరా వ్యాధి అంటువ్యాధులలో మిక్కిలి క్రూరమైనదికావున సంబంధ పడువారలకందరకును వ్యాపించును. గాన రోగము స్వస్థమగు వంరాక యింటనుండువారు ఇరుగుపొరుగువారియిండ్లకు పోవు టయు వారిని తమయింటికి రావించుటయుకూడదు.

—| రోగియింటియందలి వస్తువుల గ్రహించకుండుట. |—

రోగినివసించు నింటిలోనుండు వస్తువుల దేనినైనను ఇరుగుపొరుగువారు కోరినను ఈయదగదు.

—| ఇంటిని శుభ్రము జేయుట. |—

రోగము స్వస్థమైనపిదప నాయింటికిని ముఖ్యముగ రోగి నివసించియున్న ప్రదేశమునకును చక్కగ సున్నమ్మును పూ యించవలెను. విధివశమున నొకవేళ రోగి మరణమునొంది నచో వెంటనే యాశవమునకు దహనాది సంస్కారముల జేయు టకు దగిన యేర్పాటుల జేయవలెను. లేక పారిశుధ్యసంఘము వారికి దెలిపిన శుభ్రము జేయుదురు. ఇతరకారణములచే

చనిపోయిన శవములవలె కొంతతడవు ఉంచినచో నీయంటు వ్యాధుల వ్యాపకత హెచ్చుననుట కెట్టిసందియంబును లేదు.

## —౯ పరిచారకులు. ౯—

రోగికి పరిచర్యల జేయువారు మిక్కిలి పరిశుద్ధులై యుండవలెను. రోగిని స్పృశించునపుడును, మందులు ఆహారములు మున్నగువాని నిచ్చునపుడును, వాంతులు మలము మున్నగువానిని తీయునపుడును మిక్కిలి మెలకువతో నుండవలెను. అట్టికార్యముల జేయునప్పుడెల్ల తమచేతులను పరిశుభ్రముగ పైజెప్పిన వేడినీటిచే రెండుమూడుతడవలు కడుగుచుండవలెను.

పరిచారకులు తాము ఆహారాదుల జేయునపుడును ఉదకమును ద్రావునపుడును పైజెప్పబడిన వేడినీటియందు తమబట్టలను చక్కగనుడికించి యుతికి ఎండవేసి తామానీటియందే స్నానముచేసి కట్టుకొని పిమ్మట భుజింపవలెను. రోగికి తాము పరిచర్యజేయునంతదనుక తమ వస్త్రములు పరుండుచాపలు మున్నగువానిని ప్రత్యేకస్థలమున నుంచుకొని తామును అట్టిస్థలముననే యుండవలెనుగాని యితరులతో సంబంధము కలిగి యుండజనదు.

## —౯ విషూచిరోగులకు పథ్యములు. ౯—

స్వచ్ఛములైన బారలిబియ్యమును ఒకపిడికెడు గ్రహించి అందు రెండుసేరులు నీళ్లుపోసి మూడునాళ్లు పొం

గులు వచ్చుదనుక చక్కగ కాచి వడబోసి తేటనైయుండు
జావను తీసికొని యందు మితముగ నుప్పును వేసి కొంచెముగ
నిమ్మకాయ రసమును కలిపి మూడుగంటల కొకతూరిగాని
రోగికి అనుకూలముగ అప్పుడప్పుడుగాని కొంచెము కొంచె
ముగ నియ్యవలెను.

బారలిబియ్యము దొరకనిచో చిట్టుడుకు నీళ్లనుతీసి
యందు మితముగ నుప్పును నిమ్మకాయపులుసును జేర్చి విషూచి
యం దిచ్చుట మంచిది. బియ్యమును వేయించి బద్దలుగ పగుల
గొట్టి మిక్కిలి పలుచనగ గంజికాచి కొంచెము నిమ్మకాయ
రసమును ఉప్పును కలిపి యిచ్చుట యుచితము. దీనిచే నాలు
లియు దప్పియు తగ్గును.

—॥ కలరా వ్యాపించియుండు సమయమునం దపథ్యములు. ॥—

అన్నము.—ఆకలి కాకున్నపుడు భుజింపదగదు. చక్కగ పక్వములుగాని పదార్థములను మాడినపదార్థములను వాంతినికల్గించు పదార్థములను ఒకప్పుడు నుపయోగింపంజనదు.

పిండివంటలు.—అజీర్ణమును జేయు మినపకుడుములు, అట్లు, ఉండ్రాళ్లు, కుడుములు, రొట్టెలు, రాగిసంకటి, అంబలి, సజ్జరొట్టెలు, జొన్నసంకటి, ఆరుకయన్నము, మొదలగు వానిని కంటనైనం జూడకూడదు. బజారులలో నమ్మెడు మిఠాయి మున్నగువాని నేమాత్రమైన భుజింపదగదు.

కూరలు — చేమదుంపలు, చిరుగడదుంపలు (గెనసుగడ్డలు), పెండలము, బంగాళాదుంపలు (ఉర్లగడ్డలు), అనపకాయలు, అరటిబొందె, అవిసియాకు, మునగాకు, గోగాకు, గుమ్మడి, దోస, పనస, బెండ, గోరుచిక్కుడు, మామిడి, పచ్చిమిరపకాయలు మొదలగువానిని విడువవలెను. ముదిరినవియు కుళ్లినవియు ఎండినవియునగు కూరగాయ లెవ్వియైనను విడువనగును.

బియ్యము.— ముక్కిన బియ్యము, క్రొత్త బియ్యము, చక్కగా దంపని బియ్యము, ఊక మున్నగువానితో కూడిన బియ్యము, వీని నన్నము వండుటకుపయోగింపంజనదు.

పప్పులు.— బటానులు, వేరుసెనగకాయలు, జీడిపప్పు (ముంతమామిడిపప్పు), కంది, సెనగ, మినుములు మొదలగు పప్పులు, అనుములు మొదలగువానిని విడువనగును.

పండ్లు.— తాటిపండ్లు, జామపండ్లు, అరటిపండ్లు, కొబ్బరి, పుల్లని నారింజపండ్లు, మామిడిపండ్లు, నాగజెముడుపండ్లు, కలివిపండ్లు, పరికెపండ్లు, పుల్లరికెపండ్లు మొదలగు పండ్లను కుళ్లినవియు యెండినవియునగు పండ్లను విడువవలెను.

పచ్చడులు-ఊరుగాయలు.— ఆవపచ్చడియు, పచ్చిమిరపకాయపచ్చడియు, ఆవకాయ మొదలగు నూరగాయలును కూడదు.

మాంసములు.— తెగులు జాడ్యముకల మృగములయొక్కయు పక్షులయొక్కయు మాంసంబులును, పందిమాంసంబును, ఉప్పుఊటచేపలును, ఎండ్రకాయలును, నత్తగుల్లలును, కుళ్లిన

వియు ఎండినవియునగు మాంసములును ఉపయోగింపఁ దగవు.

చేపలు.—మెత్తాళ్లును రొయ్యలును ఓలవాలుగ మొదలగు నవియును కుళ్లిన చేపలును కూడదు.

నీళ్లు మొదలగునవి.—ఈవ్యాధి వ్యాపించియుండు ప్రదేశముల లోని నీళ్లు మజ్జిగ పెరుగు పాలు మొదలగు ద్రవపదార్థములను ఒకప్పుడును నుపయోగింపంజనదు.

నివాసము మొదలగునవి.—ఈవ్యాధికల ప్రదేశముల నుండు వారితో మాటలాడుటయు వారియింటనుండుటయు అచ్చట పరుండుటయు ఆప్రదేశములకు బోవుట మొదలగువానిని మానియుండుట చాలయుక్తము.

మత్తుపదార్థములు.—మత్తును కలిగించెడి సారాయి బ్రాందీ కల్లు గెంజాయిసల్లమందు మొదలగువాని సేవించుటను మానవలెను.

—కలరావ్యాపించియుండుసమయమున నాచరించు పథ్యములు.—

గృహము.—ఇంటిలోపలను సమీపమున నలుదెసలయందును మురికి, పేడ, చెత్త మొదలగు మలినవస్తువులు లేకుండునట్టులు చేయవలెను. బావులచెంత నేమాత్రంబును నీరుచేరక యుండునట్లుంచవలెను. దొడ్లయందైనను ఇంటికిసమీపమునందైనను అంట్లుపాత్రలను తోమరాదు. వంటయిండ్లు మొదలగు ప్రదేశములను నీళ్లతో నలకక పైజెప్పినరీతిగ వేడినీళ్లను కాచి యందు మట్టినికలిపి యాసిటిచేనలుకుట మంచిది. కుళ్లినవియు

మిక్కిలి మాగినవియునగు పండ్లు, కూరగాయలు, మాంసములు మున్నగువానినుంచకూడదు.

పొగవేయుట.—ఇండ్లయందును ఇండ్లసమీపప్రదేశములయందును గంధకమును పొగవేయుచుండవలెను. మరియు సాంబ్రాణి దశాంగధూపము గుగ్గిలము మొదలగు ధూపద్రవ్యములచే పొగవేయుటయు నుచితము. ఇంటిని ప్రతిదినంబును అన్ని భాగములయందును బూజు మొదలగు మలినవస్తువులు లేకుండునట్లు చక్కగ చిమ్ముచుండవలెను. అన్నిస్థలములయందును క్రొత్తసున్నమును పూయించవలెను. మరియు జలదారులు స్నానప్రదేశము వంటచేయుస్థలములు మున్నగు ప్రదేశములయందు ఎల్లప్పుడును మలినమించుకేనియు లేకయుండునట్లు శుభ్రముగ నుంచవలెను. ఇంటివాకిళ్లయందును ఇంటి నలుదెసలయందును ప్రతిదినము పచ్చివేపాకు తోరణముల కట్టుచుండవలెను.

మరుగుదొడ్లను చక్కజేయుట.—మలమూత్రములవిసర్జించుప్రదేశములను పలుమరు శుభ్రములుగ జేసి కర్పూరమును వసను వేపాకునువేసి కాచబడిన వేడినీళ్లతో కడుగుచుండవలెను. లేక వేడినీళ్లతోనైన కడుగుచుండవలెను.

నీళ్లు.—క్రొత్తనీళ్లు, బావులు, చెరువులు గుంటలు చెలములు మున్నగువానియందుండు నీళ్లను రెండుమూడు తడవలు వడబోసి రెండుమూడు పొంగులు వచ్చునందాక కాచి కొంచెము గోరువెచ్చగనుండునట్లు చల్లార్చి యుప

యోగింపవలెను. బియ్యము కూరలు మున్నగువాని కడుగుటకును అన్నము కూరలు మున్నగువానిని వండుటకును పాలు పెరుగు మజ్జిగ మొదలగువానియం దుపయోగించుటకును పైజెప్పినప్రకారము వడగట్టి కాచబడిన నీటినే యుపయోగింపనగును. స్నానమునకును దాహమునకునుగూడ అట్టిజలమునే ఉపయోగింపనగును.

ఆహారము.—భోజనపదార్థములలో మిక్కిలి శీఘ్రముగ జీర్ణములగునవియు అలవాటులో నుండునవియు చక్కగ పచనము చేయబడినవియు కొంచెము వేడిగనుండునవియునగు పదార్థముల భుజియింపనగును. అలవాటులో లేని యాహారపదార్థముల సేవించుటయు అలవాటున నుండు లఘ్వాహారపదార్థముల విడచుటయుదగదు. సకాలమున మితముగ భుజింపవలెను. తానెప్పుడును భుజించు పరిమితమునకన్న కొంచెము తక్కువగ భుజించుట యుచితము. అలవాటుగ భుజించు పదార్థములలో ఉప్పును కారమును మామూలుకన్న కొంచెముతగ్గించి చేర్చి యుపయోగించుట మంచిది. తానేవిధమైన యాహారమును జేసినను అయ్యది శీఘ్రముగజీర్ణమై చక్కగ నాకలిని పుట్టించునదిగ నుండవలెను.

పాత్రలు.—ఇంటిలో నాయాకృత్యముల కుపయోగింపబడు చెంబులు తపెలలు మున్నగు పాత్రలను కొంచెము నిప్పులలో పొరలించికాచి పైజెప్పిన వేడినీటితో శుద్ధి చేసి యుపయోగించుకొనవలెను. నీళ్లు త్రాగుటకును

పాలకును మజ్జిగకును వంటకును ఉపయోగించు పాత్రలను మిక్కిలి జాగ్రత్తతో మలిన మొకింతయు లేకుండ శుద్ధిచేయవలెను. పిదప నాపాత్రలను చేతులను శుద్ధిచేసికొనక ముట్టగూడదు.

వస్త్రములు.—పైజెప్పినరీతిగ సిద్ధముచేయబడిన వేడినీటిలో బట్టలను కొంతసేపునానబెట్టి చక్కగనుతికి యారవేసి కట్టుకొనవలెను. పక్కకై యుపయోగించు బట్టలనుదుప్పట్లను చెమటబట్టిన బట్టలను ప్రతిదినంబును పైజెప్పిన నీటిలో నానబెట్టియుతికి మంచియెండలో నారవేయవలెను.

శయనోపకరణములు.—చాపలు తివాచులు పరపులు మొదలగు శయనోపకరణములను ప్రతిదినంబును రెండుమూడు గంటలసేపు ఎండలో వేయుచుండవలెను.

నిద్ర.—విశేషముగ గాలియందును బైళ్లయందును నిద్రింపకూడదు. పగటియందు నిద్రించుటయు రాత్రులలో నిదుర మేల్కాంచుటయు హానికరములు. రాత్రులయందు వాడుక ప్రకారము నియమిత కాలము నిద్రించుట యుచితము.

బాహ్యోపచారములు.—అజీర్ణము లేక కడుపులో గుబ్బుగుబ్బుమని శబ్దముకలవారు మంచిఫ్లానల్ బట్టను పొట్టచుట్టును ఒకటిరెండు వరుసలు చుట్టుకొని యుండుట హితము.

భీతినివారణము.—కలరావ్యాధి మిక్కిలి క్రూరమైన వ్యాధియనియు దినదిన మనేకులు మరణము నొందుచున్నారనియు

దలంచి మనసున కొంచెమైన భయమును దిగులును
ఉంచుకొనక ధైర్యముకల్గి యుండవలెను.

—( స్వాస్థ్యపరిపాలనము. )—

"ధైర్యం సర్వార్థసాధకమ్" అను నార్యోక్తి ననుస
రించి ధైర్యమునవలంబించిన వారికి నెట్టిక్రూరములగు శారీర
మానసికాదివ్యాధులునుగూడ చెంత జేరవు. సాంక్రామికములగు
నిట్టివ్యాధులు వ్యాపించి వాని ప్రభావమును జూపునపుడు వా
టినుండి యాయువును పరిపాలించుకొనుటకై పూజ్యులగు
శ్రీచరకాచార్యులు జనపదోద్ధ్వంసనీయమున * చూపిన హితా
హితములును యుత్తమవిధులునగు కొన్నిటి నిందు బొంద
బరచెదను. ఇందు మనుజసామాన్యమునకును జేర్చియుండు
సామాన్యభావములగు సాంక్రామికవ్యాధులుగల దేశము
ఆప్రదేశమునందలి నీళ్లు పాలు గాలి ఈ నాలిగింటిని ముఖ్య
ముగ విడువదగినవని నిరూపించియున్నారు. మరియు
ప్రదేశమందలి పదార్థసామ్యమును విడుచుటయు, సాంక్రా
మికములు వ్యాపించుటకు పూర్వము సంగ్రహింపబడిన పదా
ముల నుపయోగించుకొనుటయు నుచితమని కనబరచియు
న్నారు. మరియు సత్యవంతుడుగను భూతదయ గలవాడుగను
వశక్తిగలవాడుగను సద్వ్యాపారముల నాచరించువాడుగను

* హితం జనపదానాం చ శివానాముపదేక్ష్యతే" "వ్యక్తా దేవాష్టత్రీపి భేషజైః । ప్రాదుర్భూ[illegible]
... ఖలు ఇమే భావాః సామాన్యాః జనపదేషు భవంతి. తద్యథా—వాయురుదకం దేశః కాల [illegible]
[illegible]హిత. విమానస్థాన, అ. ౩.

శమదమాది గుణసంపన్నుడుగను సర్వవిధముల నారోగ్యమును కాపాడు బ్రహ్మచర్యనియమము గలవాడుగను ఉన్నను ఆయుఃపరిపాలనమును జేయసమర్థుడగుననియు వక్కాణించియున్నారు.

"నిత్యం హితాహార విహారసేవీ సమీక్ష్యకారీ విషయే ష్వసక్తః । దాతా సమః సత్యపరః క్షమావాన్ ఆప్తోపసేవీ చ భవత్యరోగః" వాగ్భటః. సూ. అ. 4.

ఇతి శ్రీమన్మహీశూర మహారాజధానీ మధ్యవిద్యోతమాన సర్వతోభద్ర దివ్య రత్న సింహాసనాధీశ్వర శ్రీమద్రాజాధిరాజేత్యాది బిరుదావళీ విరాజమాన శ్రీశ్రీకృష్ణరాజసార్వభౌమ సంస్థానాస్థానాయుర్వేద విద్వద్వైద్య ప్రశాణ్ణ శ్రీమద్రాజకీయ సంస్కృత మహాపాఠశాలాయుర్వేద మహోపాధ్యాయ అగరం. పుట్టస్వామిశాస్త్రీచరణారవిన్ద సంసేవాసమాసాదితాయుర్వేదవిద్యా సత్సంప్రదాయ గౌతమగోత్ర విరాజమాన దివ్యన్వవాయ శ్రీకృష్ణమాచార్యపౌత్ర కోదండరామాధ్వరి దౌహిత్ర రామకృష్ణార్య రాజ్యలక్ష్మ్యమ్బాతనూభవ సకల సహృదయ విధేయ శ్రీమత్పంచమజార్జి చక్రవర్తి ప్రదత్త "వైద్యరత్న" బిరుదావళీ విరాజమాన "ఆయుర్వేదమార్తాండ" భిషఙ్మణి, పండిత డి. గోపాలాచార్య విరచితంబైన

"విషూచి-కలికా"

సమాప్తము.